ఓం

కళాపీఠ ప్రచురణ ౪

# అంజలి

(కథా సంపుటి)

అడివి బాపిరాజు

1945

కళాపీఠము
హైద్రాబాద్

# అంకితం

ఈ నా కథాంజలిని భక్తితో
నవ్యసాహిత్యాచార్యుడు
మా అన్న
రాయప్రోలు సుబ్బారావుగారికి
సమర్పిస్తున్నాను

అడివి బాపిరాజు

●

వెల ఒక రూపాయి [illegible] సర్వస్వామ్యాలు గ్రంథకర్తవి

మీజాన్ ప్రింటింగుప్రెస్సు, హైదరాబాదు-దక్కన్

# సంధ్యా నృత్యము

## ౧

సూర్యుడు మనోవేగంతో పశ్చిమానికి దిగిపోతున్నాడు.

ఆ నీలాకాశంలో నానావర్ణాలు సమ్మిశ్రితం అవుతూ ఉన్నవి. ధూమ్రాలు, నీలలోహితాలు, కుసుంభారుణాలు, శబలాలు అయిన మేఘాలు, మీగడ తరకల్లా, క్షణక్షణం రంగు మారుతూ, ఆకాశాన తేలిపోతూ, సముద్ర తరంగాలలో, నదుల్లో, చెరువుల్లో నీడలాడుతున్నవి. తరువర్ణాలు, పర్వత శిఖరాలు బంగారు పూతతో మిలమిలలాడుతున్నవి.

ఆకాశాన వంగపండుచాయ సూర్యుడస్తంగతుడైనాడు. ఉషాబాల నల్లని చీర యంచులు దెసలు ఆవరిస్తుండగా ఉదయించింది.

యోగనిద్రలాంటి చీకటి ఆవరిస్తున్నది. ఆ చీకటిలో వెలుగు చెట్టాపట్టాలు పడుతూంది. సంధ్యానాదములు, సర్వకుసుమ పరిమళాల వియత్పథానికి నివేదన లవుతున్నవి.

ఓం, ననతోం, ధిమికిటతోం, ధింధిమికిటనాం, కిణికిణీం.

అవి హిమధవళపాదాలు. అరుణకమలదళాంతర తలాలు. తారకాకాంతులపైన అనంతపథాంచలాలమీద అంటీ అంటనట్టు నాట్యం చేస్తున్నవి ఆ అంగుళులు: సౌందర్యబాలికా ఫుల్లనయన సౌభాగ్యాలు. పాదరేఖలు మహాత్ముల భావ పరివాహార్తాలు. ఆ వేగం తేజోరూపులైన సిద్ధుల సంకల్పం ఆ తాండవం లయతాండవం.

## ౨

పృథుకల్పాచార్యులు నాట్యమూర్తి. పెదవి కదుపకే ఎంతటి సూక్ష్మ భావమునైన అభినయించగలాడు. తాండవంలో ఆవేశమూర్తి, నృత్తంలో లయబ్రహ్మ. లాస్యాన గాలికి కదలే కసటు చిగురాకుజొంపము కదలిక. దశావతారాలు, నాగనృత్యం, రాధికాహృదయం, సత్యభామాసంవాదము, వజ్రకన్యా భ్రమణము, పార్వతీదేవి తపస్సు, పాలసముద్రమథనము, జగన్మోహినీ ఘట్టం, శంపాలతావేగంతో దేహభంగిమలు, కరప్రసారాలు, హస్త ముద్రలు, దృష్టి లౌల్యాలు, భావ వ్యంజనాలు పరిమళాల వెదజల్ల ఆనందమయుడై, తన్మయుడై కరిగిపోతాడు. వృద్ధుడైనా, అతని నాట్యశక్తి అవంతయినా తగ్గిపోలేదు. పృథుకల్పుడు కుమారవీరునకు నాట్యశాస్త్రమంతా నేర్పుతూ ఉన్నాడు. కుమారుడు ఆ దేశానికి ప్రభువు. ఏ పూర్వజన్మ సముపార్జితమో అతనికి చిన్ననాటనుండీ నృత్యకళాభిమానము! తడబడే అడుగుల నెలలనాటి ముద్దులలో తల్లి ఒడిలో నృత్యం చేసేవాడట! నృత్యమూర్తులగు విగ్రహాలను చూచి మైమరచిపోయేవాడు. నర్తకీనర్తకులు మహారాజైన తన నాయనగారి యెదుట నృత్యకళాశేముషీవైభవము వెదజల్లేటప్పుడు బాలకుడైన కుమారవీరుడు తనివోని గాఢవీక్షతో పరికిస్తూ ఉండేవాడు. తానే యజమానుడైన వత్సరాలలో వివిధదేశాల నృత్యవిధాల పరికించి విమర్శించి పూజ్యభావాన పులకరాలు పొందేవాడు. కళయందుండే వెర్రి మమత కళాపోషకుడు కావడంతో వదలక, కళాపీఠ పాదసన్నిధిని కళార్థిగా అతనిని సాష్టాంగపడజేసినది.

ఉన్నతవంశంవారు నృత్యకళాకోవిదులగుట మరచిపోయి ఎన్నో శకాలు గడచినవి. తోటివారి పెదవుల దాగిలిమూతలాడే అపహాస్యపు చీకట్లను భయపడినన్నీ, సిగ్గుచెందినన్నీ కుమారుడు రహస్యంగా పృథుకల్పునికి

హస్తాభినయం, నేత్ర, గ్రీవ, స్కంధాభినయాలు నేర్చుకొన్నాడు. పదగతులు నేర్చుకొన్నాడు. అంగవిక్షేపాలు. హస్త విన్యాసాలు. రస ప్రదర్శన కౌశల్యము—నృత్యవిద్య యావత్తు దీక్షతో నేర్చుకొంటున్నాడు.

భృగుకల్పుడు ఆ మహాపురాన గణికలకు, ఉత్తమవంశ బాలికలకుకూడా గురువై నృత్యభిక్ష సంకల్పించినాడు. అరవింద వారిలో కల్లా ప్రజ్ఞాశాలిని యగు నర్తకి. ఉత్తమ కులసంజాత. బీదకుటుంబములో వికసించిన వన్నెలేపువ్వు. యౌవనం బిగువులు తిరిగి మృదువైన ఆమె బాహుకాశ్యము నాట్య విద్యలో జవజవను పుణికి పుచ్చుకొన్నది.

భృగుకల్పుని నాట్యమందిరానికి కొన్ని సందేహాలు తీర్చుకోదలచి వెళ్ళిన కుమారుడు, ఆరోజు అరవింద లాస్యమూర్తి అయిన సమయాన ఆవిర్భవించినాడు. కైశికీవృత్తిమూర్తి అరవింద సిగ్గుతో యవనికాంతరాన మాయమైంది. అప్పుడామె అర్ధ వస్త్రపాటలవర్ణస్నిగ్ధమగు ఆమె వక్షఃకాంతిని మరుగుపరచలేని దుకూలలాలిత్యము కుమారుని కంటిపాపలో ప్రతిఫలించింది. ఏడాది ఈడుగల ఏకశాఖా మాత్రికరవీరవృక్షం లా కదిలిపోతున్న ఆమె యౌవనం పరమ మంత్రంలా ఆతని హృదయానికి అద్దుకొన్నది. కను మొరగిన మనోహరమేఖలా కాంతుల్ని స్మరిస్తూ, స్తబ్ధుడైన కుమారుడు గురువుగారికి ప్రణమిల్ల మరచిపోయినాడు. భృగుకల్పుని కన్నులు నవ్వుకొన్నవి. కాని ఆయన తన అధరోష్ఠాంచలాల బిగించుకొని "తెలియపరచని మీ రాక మర్యాద దూరము కాదా!" అని కుమారుని హెచ్చరించినాడు.

„నమస్కరిస్తున్నాను. అందుకొని క్షమించండి. ఆ తెరల్లో మాల్యరహితమైన నిధి గుప్తమైనది. ఏ లోకాలనుండి ఇక్కడకు అవతరించినదో?"

„కుమారా! గోప్యప్రకాశనము శాస్త్రసమ్మతము కాదు. ఆ ప్రస్తావన అప్రస్తుతమని మనవి."

„ఈ శిష్యుని కడ ప్రచ్ఛన్నము కావలసిన నిగూఢ రహస్యాలు ఉన్నవా? అని ఈ వినయి గురువులను ప్రశ్నిస్తున్నాడు."

„ప్రభూ! క్షమించు. హాస్యంలోనూ అనృతం ఆడలేను. నిజంగా అది నిగూఢ విషయమే."

# 3

అరవింద త్రిపామూర్తియై తెరలోనికి పరుగెత్తిన మరుక్షణాన విస విస సత్యభామావేషాన్ని విసర్జించి రైక తొడిగి చీర ధరించి ఉన్న కొలది మాత్రపు నగలు అలంకరించుకొని, తోట మార్గాన దొడ్డితోవ చేరి తనకై ఎదురుచూస్తున్న బండి నెక్కి పాడైపోతూ ఉన్న తన భవనాన్ని చేరుకొన్నది.

మహోన్నతిని అనుభవించి చితికిపోయిన ఆ సంసారంలో తండ్రి విచార గ్రస్తుడు, తల్లి భూదేవత, తాను ఏకపుత్రిక. బీదతనంలో గారాముగ పెరిగిన దురదృష్టవంతురాలైన అందాలకుప్ప. నానాటికి హీనమైపోయిన తన ఐశ్వర్య స్థితిని గ్రహించక అరవింద తండ్రి చంద్రపతి చిన్నతనంలో కవి గాయకాది విద్వన్మణులకు ఆశ్రయ మిచ్చిన ఉదార హృదయుడు. ఆయన హృదయం నొవ్వకుండ అతనికి తెలిసీ తెలియకుండేటట్లుగా ఆ బాల్యమిత్రుడైన నృత్యకళాచార్యుడు తన ఇంటికడనే ఆమెకు సాహిత్యాది కళలు నేర్పుతూ, తన అభిమాన విద్యయైన నృత్యంలో ఆమెను ఉత్కృష్ట కళామూర్తిగా ఒనరించినాడు. చంద్రపతికి కూతురు వివాహచింత హృదయ కంటకమైనది. పదునెనిమిదేండ్ల ఎలప్రాయపు జవ్వని అందాల ఏరి తెచ్చుకొని తనలో పొదువుకొన్న దివ్యబాల. బీదవారికి శ్రమున్న మనసొప్పరు. సంపన్నులకు అర్పించ ధైర్యము చాలదు. ఇతరుల సహాయము అపేక్షించుట అభిజాతుల పని. అపేక్షించకుండా మనుగడ మృగ్యము. అప్పులకై ఆస్తి హారతి కర్పూరములా హరించిపోయింది. తిండి కోసము భాగ్యనగలు నాణ్య రూపాలగుచున్నవి. కుమారవీరుడు తగిన అల్లుడని ఆశ. అడిగి కాదనిపించుకోవడం విషము చేతులారా త్రాగినట్లే.

తల్లిదండ్రుల హృదయం గుర్తించలేని అమాయక శిశువు అరవిందాదేవి. తనచుట్టూ ఆవరించివున్న బీదతనపు చీకట్లను పారకించింది. వెలిగే కన్నులు కొంచెం మలుపు తిరిగిన చిన్నని అర్ధగరుడ నాశిక వట్రువలు తిరిగిన పెదవులు కొంచెము విడుపై పైకి ప్రసరించి ఆమెను ఎప్పుడున్నూ హసన్ముఖిగా

చేస్తున్నవి. ఒత్తై క్రిందికి వాలిపోతూ ఉన్నది ఆమె వేణీధరం. పొంకాలు అలంకరించుకొని, మృదులత్వ మూర్తియై సౌందర్యరేఖాసమన్వితయైన అరవింద నాట్యప్రాక్తియైన ఉషాకన్యయే.

## ౪

యవ్వనమూర్తి — మధురానంద కళాసదృశ సౌందర్యరాశి — కుమారుడు అరవిందను, ఆనాడు మెరుపు కాలం మాత్రంచూచిన మరుక్షణాన్నుంచీ నిదురపోడు — ఉప్పెనలా వచ్చి ముంచివేసింది ప్రణయ పయోరాశి

ఆ నాటినుంచి రాత్రింబవళ్ళు నృత్యమే. „కోమలకరణాంగ విక్షేపమై కైశికీవృత్తి ప్రధాన" మైన లాస్యంతో ఆ బాలికను అలంకరిస్తాడు. „వృత్తిరహితమై వివిధ కరణాంగ విక్షేప" మైన నృత్తంలో ఆమె హృదయానకు దూరాననుండి, పాదసమీపాననుండి పూజలర్పిస్తాడు. ఆరభటి వృత్తి ప్రధానము, ఉద్ధత కరణాంగ విక్షేపము అయిన తాండవంలో ప్రణయావేశుడై ఊగిపోతాడు. ఆమెను ఇల్లా తాను తన భావనాయికను చేసుకున్నాడు.

ఆ సాయంకాలము, తళుకులతో మిసమిసలాడు వెలుగు దివ్వెలా, శ్వేత పన్నగిలా ఆ దివ్యకన్య నృత్యం చేస్తూ ఉండగా చూచినప్పటినుంచీ తన నర్తనశాల మాట పూర్తిగా మరచిపోయి అభినయాదుల అభ్యాసానికి వృద్ధకల్పాచార్యులవారికై తాను నగరంలో నిర్మించిన నృత్యశాలకే వచ్చుట ప్రారంభించాడు.

ఆ బాల మరల తనకు ప్రత్యక్షం కాలేదు. గురువుగారిని అడగ మనస్సు ఒప్పదు. అడగకుండుటకు హృదయం ఒప్పదు. ఆ కళ్ళల్లో కాంతులు ఎక్కువవుతూ ఉన్నవి శరీరం కృశిస్తున్నది. ఏదో మరచిపోయినవాని లా సంచరిస్తాడు. అస్తమానం తియ్యని లోగొంతుకతో పాటలు పాడుకుంటూ ఉంటాడు. విధిసంఘట్టనా కాండపటం మాటున వున్న ఆ బాలికామూర్తిని: ఉద్వేష్టిత వ్యావృత్త పరివృత్త సంకేతాది హస్తప్రాణాలతో అరమోడ్పు కన్నులతో ధ్యానిస్తూ —

" ఓచెలీ నీ వెవరు ?

ఓచెలీ నీ వెవరు ?

కలలోని బాలవా

ప్రకృతి వలపుల పాపవా ?

వారాసి కెరటాల రేఖవా ?

శాంతసంధ్యాసమయ క్షణమవా ?

అరుణాంశు చుంబితోత్ఫుల్ల సరసీజాత

హృదయమున త్రిశ పరిమళవా ? "

అని అభినయించాడు

మేఘాల తళుకాడు చపలవా ?

చుక్కల్లో మినుకాడు కాంతివా ?

తాండవేశ్వరపాద తరుణాంగుళీ శాఖ

గతిలయల మొలకెత్తు దళమువా ?

ఓచెలీ నీ వెవరు ?

ఓచెలీ నీ వెవరు ?

కలలోని బాలవా ?

ప్రకృతివలపుల పాపవా ? "

అతి తియ్యని గంభీరకంఠముతో పాడుకుంటూ తాండవము సలిపినాడు.

ప్రఫుల్ల రేఖలతో, పరిస్ఫుట పూర్ణావయవ గాంభీర్యంతో వివిధభంగిమాయుతాంగికాభినయ సుందర శరీరయుతో అతడు నృత్యంసలిపే సమయాన అప్పుడే అక్కడికి వచ్చిన అరవింద, కుమారవీరుని సందర్శించడం సంభవించినది అతనికలలోని బాల నవ్వుచూపుల ప్రసరస్తూ మనోవయనాన ప్రత్యక్షమై ఉండుటచేత, ఆమె నిజస్వరూపముంతో సాక్షాత్కరించినా గమనించక, కుమారవీరుడు, చేతులుచాచి సాత్వికాభినయ రూప ప్రణయ విరహావస్థ దృశ్యంపజేస్తూ నృత్తము మాత్రము సలుపుతున్నాడు.

ఈ బాలు డెవ్వడు ? ఎంత మనోహర మూర్తి. ఏమి దివ్యత్వము ! నృత్య శాస్త్రపారంగతుడైన కుమారస్వామిలా వెలుగుతున్నాడు. కొత్త దేశాల నుంచి వచ్చినాడా గురువుగారి దగ్గర నృత్య శాస్త్రము పూర్తి చేసుకోతలచి? ఎన్నాళ్ళుగా ఉన్నాడో? ఇదివర కెవ్వరు చూడలేదే — అని అనుకుంటూ అరవింద అట్లే నిలిచిపోయినది ఆచార్యులు "తల్లీ! కూర్చో అమ్మా" అన్నాడు.

౨

పృథుకల్పుడు, కుమారవీరునికీ అరవిందకూ సందర్శనము సమకూర్చిన మహానటునికి తన మనస్సులో వివిధ విధాల జోహారు లొనరించాడు.

ఆయన మనస్సులో అరవింద చరిత్ర అంతా జ్ఞప్తికి వచ్చింది. అరవిందాదేవి ఉదయగిరి ప్రభువైన చంద్రారెడ్డి మహారాజు కూతురు. ఆ ప్రభువులు కుమారవీరుని తండ్రిని, సకలమండలేశ్వరేశ్వరుని, సార్వభౌముని రెడ్డికులదుగ్ధాంబోధి చంద్రుని, ఆయన వేమారెడ్డిని ఓడించి స్వాధీనం తుసుకొ సంకల్పించి ఉన్నాడని దుర్మార్గులు కొండప చక్రవర్తితో చెప్పడం చేత, చక్రవర్తి సైన్యాలు కూర్చుకొని వచ్చి, చంద్రాపతిని ఓడించి రాజ్యమునుంచి తరిమివేశాడు.

ఆ చంద్రాపతి సభలో మహాపండితుడు తేజశ్శాలి పృథుకల్పుడు సాహిత్య సంగీత నాట్యాచార్యుడుగా ఉండెను.

తానూ తన మహారాజుతో వారణాశి మొదలైన పుణ్యక్షేత్ర యాత్ర లొనరించాడు.

కుమారవీరుడు తండ్రి మరణానంతరం రాజ్యానికి రాగానే అతడు నాట్యవిద్యకు పరమపూజ అర్పిస్తున్నాడని విన్నాడు పృథుకల్పాచార్యులు.

వెంటనే చంద్రాపతిరెడ్డిని రహస్యంగా కొండవీటికి తీసికొనివచ్చి, సమయం చిక్కినప్పుడు మహారాజుకు నిజము నివేదింప సంకల్పించినాడు.

పృథుకల్పుడు కుమారవీర మహారాజు ఎదుట తన విద్య చూపినప్పుడు మహారాజాని పాండిత్యానికి ఉప్పొంగి ఆయన్ను తన గురువుగా స్వీకరించాడు. ఇది జరిగి ఒక సంవత్సరమైనది.

మహారాజు అరవిందాదేవినిచూచి పార్వతినిచూచిన శివునిలా, లక్ష్మిని చూచిన విష్ణునిలా గాఢపరిణయాన మునిగిపోయివాడు.

అరవింద మనస్సును ఆతనిపై లగ్నమయినట్లే సంభాషణ వ్యక్తం చేస్తున్నదని పృథుకల్పుడు ఆనందాన మునిగిపోయివాడు.

కరప్పరం తీసిపోని అందము, ఒకశ్లోకళ్లకు తగ్గిపోని విద్యాజ్ఞానము, ఒండొకళ్ళకు నేర్పదగిన నాట్యకళాదీక్ష.

అరవింద మొదట సిగ్గుపడినా తాను నాట్యం చేస్తూ ఉన్నప్పుడు కుమారుడు ప్రేక్షకుడై ఉండుటకు పోనుపోను ఒప్పుకున్నది.

ఆమె చూస్తూఉన్నదని కుమారుడు తన విద్యఅంతా అత్యంతశ్రద్ధతో, ఆనందమయ వ్యాసంగంతో, అద్భుతశారీర పూరిత గాంధర్వంతో, నాట్య నృత్యనృత్తాదులు సలుపుతూ ఉండేవాడు.

మొదటి రోజుల్లో అతను చూస్తూఉన్నప్పుడు ఆమె సంపూర్ణమైన నృత్యనిపుణత్వాలు చూపించలేకపోయేది. గొంతుక వ్రీడాభారంచే గళాంతరాలనే దాచుకొనేది.

దినాలు, మాసాలు పరువులెత్తాయి. యువతీ యువకులగు ఆ ఇద్దరకూ స్నేహము. పూర్ణమై ఒకరొకరి లోపాలు సవరించుకొంటూ ఒకరినొకరు ఉద్బోధించుకుంటూ నృత్య కళానందమయులై పోయినారు.

అరవిందకు కుమారు డెవ్వడో తెలియదు పృథుకల్పాచార్యుల వారిని తానెవ్వరో చెప్పవలదని కుమారుడు వేడుకొన్నాడు.

కుమారుడులేని ఒక సాయంత్రము, అరవింద గురువుగారి పాదసమీపాన్న అధివసించింది.

“ స్వామీ ! ప్రతిభామూర్తి, ఈయన ఎవ్వరో ? విదేశవాసి ‘నాట్యకుమార’ అభిఖ్యుడని సెలవిచ్చారు. సంపూర్ణంగా ఆయన ఉదంతం చెప్పరూ ? ”

" అమ్మాయీ! అంతకన్న నీకెందుకమ్మా? ప్రతి కొత్తవారిని గురించీ మనకెందుకు? నాట్యం నేర్చుకోవడానికి వచ్చాడు; నాట్యం నేర్చుకుని తనదారిని తాను చక్కాపోతాడు "

" అవునండీ, ఇంత శేముషీసంపన్నుడు తమకు శిష్యుడు కావడం చాలా ఆనందముగా ఉన్నది. అందుకని ఎవరా అన్న ప్రశ్న ఉదయించింది. "

" నిజమే! ఈ విచిత్ర సంఘటన నాకున్నూ ఆశ్చర్యాన్ని ఉద్భవింప చేస్తూ ఉంటుంది. "

" ఏ విచిత్ర సంఘటన? "

" ఇద్దరు అపురూపమూర్తులు, విద్యా వినయ సంపన్నులు ఒకే గురువు వద్ద శుశ్రూష చేస్తూ ఉండడం. "

" అందులో ఏమి విచిత్రం ఉంది? ఉత్కృష్ట విద్యాసాగరులయిన తమదగ్గిర ఎన్ని దేశాలనుండి ఎన్ని రకాలవారు ఎంతమంది రారు? ఇద్దరూ అంటే ఏ ఇద్దరూ? "

" అనేక 'ఇద్దరు' ఉండరు తల్లీ! "

... ... ...

" కుమార సంభవ యక్షగానం నేర్పుతామన్నారు? "

" ఇరువురూ ఒకే యక్షగానంలో అభినయిస్తూ ఉంటే? "

... ... ...

" నాయనగారు తమర్ని ఒకసారి వచ్చి కలుసుకోమన్నారు. "

" నీ వివాహ విషయం కాదు కదా! "

" ఏమండీ స్వామీ! నాలుగయిదు రోజుల్నుంచి నన్ను ఒకటే వేళాకోళం చేస్తున్నారు. నామీద దయ తప్పిందా? "

ఆమె కన్నులనీరు తిరిగి తల వంచుకుంది.

" ఆఁ! ఆఁ! అదేమిటమ్మా అరవిందా! ప్రాణసమానమైన నా బిడ్డతో ఇంచుక హాస్యమాడి కాస్త నవ్వుకోకూడదా? "

అంతట ఆమె మంచువీడ్డ పూర్ణచంద్రునిలా వికసించిన మోముతో, నవ్వుతూ గురువుగారి పాదాలకు నమస్కరించింది.

శ్రీభూకల్పాచార్యులా బాలను అవ్యక్త స్వనముతో "దీర్ఘాయుష్మతీ భవ, దీర్ఘ సుమంగళీ భవ, సత్వర వివాహప్రాప్తిరస్తు," అని చేయి తలపై ఉంచి ఆశీర్వదించి పంపాడు.

ఆ రాత్రంతా అరవిందకు నిద్రపట్టదు. గురువుగారి ఆశీర్వచన వాక్యాలు గానంలా, ఉరుములులా ఆమె హృదయంలో ప్రతిధ్వనిస్తున్నవి.

౬

కుమారునికి నానాటికి ప్రేమ ఆవేశరూపమైంది. అరవిందను తలవని, అరవిందాదేవిని పూజించని నిమేషమైనా లేదు. మహాలక్ష్మీప్రభావాత్మకంగా అరవిందాంకితమైన దరువులు, పదాలు ఎన్నో రచించుకుంటున్నాడు. అభినయించుకుంటున్నాడు.

నాట్యకళాభిమానంతో కుమారవీర మహారాజు తన నగరంలో ప్రతీ ఏడూ సంక్రాంతి పండుగకు నృత్య విద్యా ప్రదర్శనం ఏర్పాటుచేసి బహుమతు లిస్తున్నాడు

నర్తకీ నర్తకులనేకులు దేశదేశాలనుండి యాత్రలు సాగించి ప్రకృతి దేవీ సువర్ణోత్సవానికి విజయం చేసి, తమ విద్యానైపుణ్యం ప్రదర్శించి, బహుమతులంది, విందులారగించి, ఉత్సవంలో పైమరచి, తాండవించి, వెళ్ళుతూ ఉంటారు.

ఆ సంవత్సరం పండుగలకు కుమారుని నగరానికి ప్రసిద్ధినంది, కీర్తికాములయిన నటీనటకులు విడివిడిగా, జట్టులు జట్టులుగా విజయం చేసినారు. నగరమంతా అలంకరించినారు. ప్రభుసేవకులు అప్రమత్తతతో అందరికీ విడిదలు చూపినారు, బహూకరించినారు.

విద్యాదక్షులైన పండితులు పరీక్షక వర్గంగా నియమించబడ్డారు. సభ రసజ్ఞులతో, పండితులతో, వీరులతో, విద్యావంతులతో, ప్రభువులతో, సంపన్నులతో, ఉద్యోగులతో నిండి ఉన్నది. వనితాలోకం వివిధాలంకార భూషితమై భూమిమీద కవతరించిన ఇంద్రచాపంలా ఒక వంక వెలుగుతున్నది.

తమ ప్రభువగు శ్రీ శ్రీ కుమార వీరవర్మ కూడా నాట్య కళా వైదుష్య ప్రకటన చేయగలడన్న వార్త ఎవ్వరికీ తెలియదు. ప్రభువు తన పీఠం మీద లేడు.

నాట్యకళలో ఆంధ్రులప్రజ్ఞ అప్రతిమానం. బ్రాహ్మణ కుటుంబాలవారీ దివ్యకళను అవలంబించి, భారతీయులోకాన్ని మెప్పించి, మహారాజుల సన్మానాన్ని పొందుతూ, చక్రవర్తుల ఆదరణాలు పమపొందిన్నూ, లోక విఖ్యాతిని అందుకుంటూ, అగ్రహారాలు అనేకం గణించుకున్నారు. ప్రభువులున్నూ ఈ పవిత్రకళయందు తమకున్న అభిమానంచేత నర్తకులై దివ్యానందం పొందుతూ ఊగిపొయ్యేవారు. ఆ ఉత్సవంలో సభ కిటకిటలాడిపోయింది.

వేణువులు. వీణలు, మృదంగాలు, శ్రుతివాద్యాలు ఒక్కసారిగా మోగినవి.

ఒకరితర్వాత ఒకరు వచ్చి తమ కళానైపుణ్యాం లాస్యములో, నృత్తములో, తాండవంలో, నాట్యంలో అభినయ పూరితంగా భరతవిద్యలో ప్రదర్శిస్తున్నారు. దేశ్యాలయిన సాంప్రదాయాలు, వివిధకాల సాంప్రదాయాలు ప్రకాశిస్తున్నవి.

కిరీటాంగద కేయూరకంకణ కంఠహార శృంఖలాలతో కళ లుట్టిపడు వేషాలు, మంజీర కింకిణీరవాలు తాళగతు లవుతున్నవి

రంగు రంగుల దుకూలాంతరీయాలు—అంచులతో మెరుమల్లా లలితము లవుతున్నవి. ఒక్కొక్కరి నాట్యాలే పూర్తయైన తర్వాత ఒక బాలనటుడు రంగస్థలంలోనికి అవతరించాడు అతని తేజస్సు రంగస్థలమున్ను, మహాసభయున్ను నిండిపోయింది. అతని మూర్తి అనంత సౌందర్యపూరితము, అతని రేఖావిలాసాలు సుధాకర కిరణ ప్రసారాలు.

“చిది చిన్విలాసుడా-ఆ-ఆ-రాఘవుడు—ఊ - ఊ - సీతామనోహరుడు—ఊ-ఊ-వెడలెను—”

అని ఎత్తుకున్నాడు.

“తకిటికాతోం, ధిం ధిమికిటా తోం, తోం” అని మృదంగం పలికింది.

ఒక గంతున రంగమధ్య స్థలానికి తేలి
" వెడలెనూ విశ్వామిత్రుని
యాగరక్షణకు వెడలెనూ,
శ్రీరా___ఆ_ఆ_మూడూ వెడలెనూ అడవులకూ "

అప్పు డాతడు శ్రీరామచంద్రుడే. దివ్యవినీలకాంతులు చంచలిత హాసాంచల సాత్త్వికాలలో, పరిప్లావిత భ్రూయుగ్మ వ్యంజనాలలో, భ్రమిత హస్తవిన్యాసాలలో, భంగరచితాంగ విక్షేపాలలో కలసి, వెలుగునీడలై మహోద్రుతులయినవి.

సర్వాలక్షణలక్షితుడు డా బాలనటుడు రంగస్థలంలోకి రావడంతోనే అందరి హృదయాలూ చూరగొన్నాడు. అందరు అతనియెడ వినమ్రులైనారు. అతని ఆట పూర్తియైనది. సభ్యుల హర్షధ్వానులు గోపురాల ప్రతిధ్వనించాయి అతడు మహావీరుడు.

తన మిత్రుని భరతకళావిజ్ఞత తనకు పులకరాలు ఉద్భవింప చేస్తూ వుండగా అరవింద కరిగే కన్నులతో ఆతన్ని తనివోవ పాకించింది. అతడు అమిత హర్షాశ్రులతో అరవిందవైపు చూడ్కులు ప్రసరించి చిరునవ్వులు వెదజల్లాడు.

౨

ఆ వెంటనే ఇంకో యువకుడు రంగస్థలంలో ప్రత్యక్షం అయ్యాడు.

అతని శరీరకాంతి తప్తకాంచనము, అతని భ్రూయుగ్మం మధ్య చంద్రుని కాంతులు వెలుగుతున్నవి.

అతని చతుర్విధాభినయాలు పరిష్కృత సాంప్రదాయాతీతమైన ఒక వినూతన నృత్యవిధాన జనితాలు

వృత్తిరహితమయిన్నీ, సర్వవృత్తిగర్భితమైన నృత్తం సలుపుతున్నాడు. అతని కంఠ మెట్టిదో, రస విప గంధక సంకీర్ణమైన ఏ ఔషధసేవ చేసినదో! మధురాతిమధురమై, ద్వాదశారాన్నానుభూతమైన వేదవనసను ధ్వనింపచేసే స్వరకల్పనలో సమస్త జగత్తూ నిండినట్లయినది.

సభ నిశ్శబ్దము. సభా హృదయాలు, ఆత్మలు పూవులై, కర్పూరాలై ఒక్క పరమ నివేదనైపోయినవి.

ఆ క్రొత్తయువకుడు విజయుడు కాక ఎట్లు? జయధ్వానాలు గంభీర కల్లోల సదృశంగా విరుచుకొని పడినవి.

* * *

,, ఎవరే యీ మహాప్రజ్ఞి !"

,, ఎవరోహో ఈ పరమాద్భుత నటకుడు !"

అని సభాహృదయాలు ప్రశ్నలు చేసుకొంటువ...

* * *

అరవిందకు తా నేమవుతున్నదీ తెలియలేదు. మహామనోహర సుగంధ ఝుకీవేగాన కాలునిలువక కొట్టుకుపోతున్నట్లు కలగాని కల.

అప్రయత్నంగా లేచి రంగస్థలం వెనక నేఉన్న నేపథ్యశాలలోకి చొచ్చుకుపోయింది.

, ఏమా ? ఈ విపరీత' మనుకొంటూ చంద్రావతి ఆమె వెనకనే వెళ్ళినాడు. నటకులు, సభ్యులు తండ తండాలుగా ఆ నూత్న నటుణ్ణి చూడ డానికి నేపథ్యశాలను చుట్టివేస్తున్నారు.

ఇందరు చూస్తున్నారని గుర్తులేదు. ఎవరు ఏమనుకొందురో అన్న భీతి లేదు. సహజ మాధుర్యగుణమైన సిబ్బితి వదిలి, గంభీరమూర్తి వెడదఉరము వాడు, దీర్ఘబాహువులవాడైన ఆ విలాతినటునియొక్క సౌందర్యరేఖా కారాలైన పాదాలకడ మోకరిల్లి మూర్ఛబోయింది.

ఒక్కుమ్మడిగా వృగసుకల్పాచార్యులవారు, కుమార వీరుడు, చంద్రావతి ప్రభువు ఆక్రొత్త నటుడు అందరూ అరవిందాదేవిని లేవనెత్తుటకు ఆమె దగ్గరకు వాలారు. కుమారవీరు లా బాలను ముందుగా విష్ణువు భూమి నెత్తి నట్లు ఎత్తి ఆ సమ్మర్దంలోంచి తీసుకొనిపోయి ప్రాసాదాంతఃపురములో దాసిజనాలచే పరిచర్య చేయిస్తున్నాడు సభలోనున్న ప్రభువైద్యుడు, ఆజ్ఞరా లోనికి విచ్చేసినాడు.

అరవిందకు తెలివివచ్చినది.

తెలివివచ్చేటప్పుడు „ప్రభూ” అని వైద్యుడు తన స్నేహితుడైన నాట్యకుమారుణ్ణి పలకరించడం విన్నది. ఒక దాసీని రహస్యంగా అడగగా „వారు కుమారవీర మహారాజుగార”ని ఆమె జవాబు చెప్పింది.

అరవిందకు త్రపయూ పౌరుషమూ పట్టరాని కోపమూ వచ్చినది ఇన్నాళ్లు ఈ మాయావి మారుపేరుతో తన ప్రాభవం దాచుకొని తన చనవు నాశించి నాడుగా! గురుదేవులైనా నాకీ రహస్యమించుకంత సూచింపరైరిగా? ప్రభు గౌరవం వారిని చెప్పనిచ్చినదికాబోలు. నా పేదతనం కదా ఈతనికి నన్నింత చులకన చేసింది. చంద్రాపతికూతురు కపటానునయాలతో సమీపింపదగ్గదా? గురువుగారు నాకీ రహస్యం దాచిపెట్టడం చూడగా ఇది వీరందరూ కలసి చేసిన కుట్రకాదుగదా. ఇంకో సంపన్నుల యాడుబిడ్డ నీతి సిట్లు అనుసరింప గలడా? అంటూ ఒక్కుమ్మడి భావప్రధాన విద్యుద్వేగంతో ఎన్నియో తల పోతలు పాటుపోటులుకాగా, ముద్దరాలైన అరవింద, తన అభిజాత్యం, అభిమానం రక్షించుకోడానికది తరుణంఅని యెంచి, తనమనస్సే తా నెఱుగ లేని ఆవేగంతో కంపించిపోయింది.

ఏమిది? మహారాజు ప్రచ్ఛన్నుడై మాయతో తన చనవు ఆశించి నాడా? ఆయన ఉద్దేశమేమి? హృదయస్సంక్షోభంతో నిదానమైన ఆలోచనలేని అరవిందాదేవికి, ప్రభు వేదో దురుద్దేశంతో తన స్నేహం చేశాడన్న కోపం పొంగి పొర్లిపోయింది. తన పేదతనం కాదా ఇంత చులకన చేసింది. తన తండ్రిమాత్రం మహారాజు కాడా! విధివశాన రాజ్యం కోలుపోయినంత మాత్రాన తాను హీనరాలయిందా? ఏదో కుట్ర ఏదో మాయ తనచుట్టూ మహారాజల్లినాడు.

నాట్యవిద్య మహానటేశ్వరుని పూజ అనే ఆమె భావం! అందుకు తన జీవితం ఎందుకు నివేదన చేయకూడదు? ఈ మహారాజున్ని, ఈ హీన సంస్కారాన్ని నమ్ముకోవడంకన్నా ఆ మహానటు డెవడో అతనికి తన బంతును అర్పించడం ఉత్తమం అని భావించుకొన్నది. ఒక్కుమ్మడి భావ ప్రధాన విద్యుద్వేగంతో ఎన్నో తలపోతలు రాగా, లలితాంగి అరవింద

తన అభిజాత్యం అభిమానం రక్షించుకోవడానికి అతిశయణంతో ఎంచి, తన మనస్సే తానెరుగలేని ఆవేగంతో కంపించిపోయింది.

మనస్సులో ఉన్న కుమారవీరుని బింబం విస్మృతమైంది. ఆ అపరిచిత నటశేఖరుని దివ్యరూపం హృదయాంతరాలలో స్ఫుటకాంతి పూరితమై ప్రత్యక్షమయింది. ఆ అలౌకిక నృత్యకౌశల్యం దివ్యునకు కాక ఎవరికి ఉంటుంది? ఆమె హృదయం రక్తిభాతి రక్తిమమై మెరుపు తీగలా చంచలించింది.

తన సర్వస్వం ఆ నూతననటుని పాదాంబుజాల కేల సమర్పించుకో కూడదు. పూజచేస్తూ శిష్యురాలై అతన్ని అనుసరించడం మహాభాగ్యం.

జేవురించిన తన ముఖారక్తిమా మాధుర్యాన్ని తన చూపులలోని ఏదో చలితాగ్ని శిఖలను చూస్తూ మాన్పడి నిలచిన కుమారవీర మహారాజునకు ఒకవీక్షణమైనా ప్రసాదించక చివుక్కున లేచిందై అరవింద విసవిస నడచిపోతున్నది

చంద్రావతిరెడ్డి ప్రభువు “అమ్మాయీ! ఎక్కడికమ్మా” అంటూ వెంటనంటి పోతున్నాడు; ఆమె తన తండ్రిగారి ఆవేగనా పూరితమైన కేక వినిపించుకోక నడిచిపోతున్నది.

అప్పటికప్పుడే రాత్రి మూడు యామాలు గడచిపోయినాయి. సేవకులు అరవిందాదేవికి దారి చూపడానికి వెండి కాగడాలతో గూడా పరువెత్తుతున్నారు. వెన్నంటివచ్చే తండ్రివంక కుమారునివంక తిరిగిచూడక విసవిస నడచి భృగుకల్పాచార్యుని గృహం ప్రవేశించింది.

గురువువరస కూర్చున్న నాట్యమూర్తిని దూరాన్నుంచే చూచింది. ఆమె ముగ్ధహృదయం దడదడ కొట్టుకున్నది. ఇంతలో ఆ అపరిచిత సుందర దివ్యమూర్తి తన్ను గాంచి, చిరునవ్వు చంద్రికలు వెదజల్లుచు దగ్గరకురమ్మని తలఊపాడు.

ఆమె సర్వాంగాలు చిరుచెమ్మటలతో ప్రాతస్తుషారార్ద్ర ఫుల్ల కుసుమాలైపోయినవి. పారవశ్యాన అడుగులు తడబడ ఆ నటుని సమీపించి పాగిల పడ్డది.

“ప్రభూ? ఇది సానురాగమైన నా హృదయము. నాజన్మ, ఈ క్షణంవరకూ మీకొరకే మీదు కట్టబడి ఉందేమో! ఈ అజ్ఞాత బాలికను నీ పాదదాస్య మనుగ్రహించవా?” అని బాష్పరుద్ధకంఠయై పలికింది.

ఇంతలో అచ్చటికి ఆమె ననుసరించి వస్తున్న కుమారవీర చంద్రా పతులు లోకి రావడం అనూహ్యనటుకు చూచి, తన చేరువ సాగిలపడియున్న అరవింద నుద్దేశించి « అమ్మాయీ నీవీ కుమారవీరుని ప్రేమించుటలేదా ?» అని ప్రశ్నించాడు

అరవింద మాటలాడలేదు

«ఏమమ్మా పలుకవు » అని అతడు హెచ్చరించాడు.

అరవింద « ప్రభూ ! ఈ అభాగిని రాజప్రాసాద మహైశ్వర్యాన్ని కన్నెత్తి చూడజాలదని కుమారవీర మహారాజులుంగారు ఎరుగుదురు. కలలోనైనా నాకటువంటి లోభం పొడమకుండా వారు తను అభిమానంవల్ల ధ్యాయుక్తమైన కట్టుదిట్టాలు చేశారు. నిన్నటిదాకా నేను శరణుచొచ్చాను. వారి మాటెందుకు స్వామి ?» అని కంటనీరు జలజలరాల పలికినది

అసూయా విషావాలు హృదయాన్ని ఆవరించి కుమారభిక్షుని మోము జేవురించింది. ఎంత శిల్పిఅయినా, ఎంత హృదయహీనుడైనా, ప్రాణాధికయైన తన ప్రేయసిని తనకళ్ళయెదుట, ఎవరో ఊరు పేరులేని ఒకనికి అట్లు తన్నర్పించుకొంటూ ఉంటే సహించగలడా ?

ఈ బాలికతన్ను ప్రేమించి-దిఅనిపరగవశుడైపొందాడు ఆమెవరకైనా తన మహారాణిగా చేయాలని సంకల్పించాడు. వారిద్దరి సాఖ్యం ! సతీపరమేశ్వరులులా; రాధికా కృష్ణులులా నారుఒకరికోసంఒకరు, తమకోసం తామిద్దరూ నాట్యాలతో మహితానుభూతితో ఆనంద పరమావధిలో లయమైపోవాలనుకుంటున్నాడు అయువప్రభువు.

ఈబాలికతన్ను ప్రేమించలేదా ? ఇన్నాళ్ళుతాను రిత్తకోరికలతో దివాస్వప్నాలు కంటున్నాడా? నీమకుమార హృదయంలో ఉన్న తనకున్న అనుమాపవిత్ర భావంవల్ల తన నిజస్థితి గోపనం చేయడం ఎంత తెలివితక్కువపని. ఒహో ఈ దివ్య సుందరాంగి తానెవరో తెలిసికొని, తన నిజస్థితి తెలిసిఎంత కించపడింది ?

ఇన్నాళ్ళ తమసాహచర్యం, తమ సహాధ్యాయిత్వ మాధుర్యం ఎంతలో కరిగిపోయింది? గాఢమైన స్త్రీ హృదయం ఎవరు తెలుసుకోగలరు ?

కళాపూజోన్మాదంచేత ఈ కవీనాగతుణ్ణి పూజలుచేసి నాడు తాను. ఈ నా పవిత్ర భాగధేయమని ఎంచుకున్న అరవిందాదేవి రాజ్యం పోయినచంద్రాపతిప్రభువుకనయాఅనితనకు తెలిసింది అరవిందతనహృదయాన్ని

పూలమాలతో అలంకరించే మహూర్తంలో చంద్రావతి మహారాజుకు ఉదయగిరి రాజ్యం తొల్లింటి సర్వస్వాతంత్ర్య దేశంగా అర్పించాలని తాను గురువుగారితో పలికిచేపుడము దోషమా ? ప్రభూ! అనంత తాండవ వరిత సుందరపాదా ! ఏది తనకుదారి! ఈ కొత్తనటువిలది అరవిందతనకు కానిదై పోవునా ప్రభూ !

కుమారవీరు డిట్లు తలపోతలకు జిక్కి ఇతికర్తవ్యతామూఢుడై నిలుచున్నాడు.

ఆ నూత్న నటమూర్తి:- ఓ వెఱ్ఱికల్లీ ! నీ లేతహృదయానికి అనంత గంభీర ప్రేమరహస్యాలు ఏమి తెలుస్తాయి నన్ను ప్రేమించడం దుష్కరం. దేశదేశాల్లో, అడవుల్లో, ఎడారుల్లో తిరిగినచోట తిరక్కుండా తిరుగుతుంటాను

అర:- సమస్తమూవదలిమీతో ఎక్కడికైనాసరే మీనీడలో అనుగమిస్తా ప్రభూ ! నన్ను పరిగ్రహించు ! ఇతరం నాకేమీవద్దు !!

కుమా:- స్వామీ ! నువ్వెవ్వరవో నాకు తెలియదు. నేను ఈదేశ ప్రజకు రాజును ——

నూత్న:- అవునయ్యా అవును నీకు భరతవిద్యఅంటే పరమప్రీతి ! నువ్వు ఈ మహారాజ్యం అంతావదలి నాతోరా ! నీ ఊహకు, నీ జ్ఞానానికి నీ శక్తికి అతీతమైన మహోత్తమ దివ్యనాట్య విధానాల్లో నిన్ను అత్యంతో త్కృష్ట విజ్ఞానవంతుణ్ణిగా జేస్తాను !

కుమార:- స్వామీ ! ఏమిటి తను ఆదేశం ?

పృథు:- స్వామీ నేను సమస్తమూ తెలిసినవాడినని గర్వపడినాను. ఈ భువనంలో నాతోటి సమాన ప్రజ్ఞాయుతకళాసృష్టి లేదని విర్రవీగాను. నీ నాట్యముచూచి మహాకోప్రధవంతుణ్ణయ్యాను అనేక దోషాలున్న కుపండితుడ ననుకొన్నాను. నేను నా అజ్ఞానానికి తలవంచు కొంటున్నాను. నన్ను నీతో తీసుకొనిపో, నీకు శిష్యాతి శిష్యుణ్ణయి ఏకదశం మాత్రం నేర్పిన నాట్యవిద్య నీవద్ద పూర్తిచేసుకుంటాను.

నూత్న:- మంచిదయ్యా; పృథుశిల్పాచార్యా ! నీకు నా నమస్కారాలు నువ్వు నాకు తగినవాడవయ్యా ! లే! ఈ యువతీ యువకులు ఒకరినొకరు ప్రేమించినీ తమప్రేమను తాము గుర్తించలేనియౌవనమదాయత్తులు. వీళ్ళకు కళ ఏమిటి ? కళారాధన ఏమిటి ?

అరవింద:_ ప్రభూ! ప్రభూ!

కుమారవీరుడు:_ స్వామీ నేను దిగ్భ్రమలో పడ్డాను. ఏదో నిస్సహాయత, ఏదో పరవశత్వము నన్ను ముంచివేస్తోంది. ఈ అరవిందాదేవి నీకు పాదాక్రాంత అయింది,

సూక్ష్మనటుడు:_ ఓయి వెఱ్ఱివాడా! అరవిందకు నువ్వోయి సూర్యుడవు. ప్రేమకు కళకు అనంత రహస్య సంబంధముంది. పృథుకల్పాచార్యా మృదంగం ధరించు, అరవిందా వీణతాల్చు, కుమారా వేణు_

ధిం ధిమికిటతోం, తోం, తోం!

ఆతని నవ్వులు సంపూర్ణ జ్యోత్స్నా సహస్రాల గర్భీకరించుకొన్న వెలుగులైనవి.

ఆతని కాళ్ళను బంగారుమువ్వలు 'కింకిణకిణాం, కిణాం' అని ధ్వనించినవి. ఆయన ఒక అద్భుత భంగిమ తాల్చినాడు.

పృథుకల్పుని మృదంగం, అరవిందవీణ, కుమారుని వేణువు ఆ గతికి సమన్వయాలయ రూపంతాల్చింది. కేదారగౌళ రాగిణి ఆవిర్భవించింది.

ఉదయాద్రిపై అప్పుడే అరుణా లవుతున్న ఉషఃకన్య చేలాంచలాలు గాలిలో దిక్కులు ప్రసరించినవి

గోష్ఠాలలో గోమాతలు చేపు బరువున అంభా అని వత్సముల పిలుస్తున్నవి. జీవాల యఘంటానాదము లా ప్రత్యూష వాయువులతో కలసి వీతెంచుతూ ఉన్నవి.

సౌందిర గవాక్షాలలో తోటయున్నూ, తోట వెనక తోటకు ఎరుపు రంగు అద్దుతూ ఉన్న ఉదయ సంధ్యారుణ కాంతులున్నూ విప్పారిన నేత్రాల నిండుతున్నవి. పక్షులు సా_రీ_గా_మా_ పా_సా_ మపా_సా అని పాడుతున్నవి.

ఆ నటుని నాట్యమునందు కరణాలు మూసయినవి

ఆ మందిరాన కుడ్యాలు, స్తంభాలు, తోరణాలు వితానాలు మాయమై పోయినవి. హిమవన్నగ శిఖరాలు దవుద వ్వుల తోచినవి. శీతల వాయువులు ప్రసరించినవి. పవిత్ర పారిజాత పరిమళాలు కలవంపులై వాకలైనవి.

అప్రయత్నంగా అరవిందా కుమార పృథుకల్పులు తమతమ వాద్యాలు మోగింప మానినారు. చంద్రాగవతి దివ్యగనాట్య సృష్టిచూస్తూ మాప్పడి నిలుచున్నాడు.

ఆ దివ్య నాదాలు, కిన్నరీ స్వనాలు, మహతీ వీణానాదాలు.

కూతుర్ని చేసుకున్నాడు. ఆమెను అలంకరించాడు. ఆటలు నేర్పాడు పాటలు నేర్పాడు చుట్టూ పెద్ద గట్లు వేయించి తోట తయారుచేశాడు. తూర్పు గట్టుమీద తాను పాకవేసుకుని పొలంలోనే మకాం పెట్టాడు

## 3

బచ్చులయ్య అనవసరంగా ఎవ్వరితోనూ మాటలాడే వాడుకాడు. తన రెండెకరాల వ్యవసాయం చూసుకుంటూ తీరిక దొరికినప్పుడు తన పొలం గట్లమీద కలకల లాడుతూ అవతరించిన తోటకు సేవచేస్తాడు. కష్టాల్లో ఉన్న బీదరైతులకు ఏదో కాస్తో సహాయంగా సాయంచేయడం ఇదే అతని జీవిత మార్గం.

పచ్చగా ఉన్న బచ్చులయ్య మాట అందరికీ పథ్యంగా సాగింది. రెండెకరాలకు నలభై బస్తాలు పండుతాయి అమ్మితే కనీసంలో కూడా అతనికి రెండువందలు వస్తాయి. ఎద్దుల మేతకు, తనభోజనానికి సంవత్సరానికి రెండువందల నలభై ఖర్చు అవుతున్నది.

పళ్ళకూ, కూరగాయలకు, కొబ్బరికాయలకు, గట్లకేసే మినుములకూ కందులకూ సాలుకు రెండువందలు వస్తున్నవి. ఆకుమళ్ళకు నూరు రూపాయలా దాయం వస్తుంది ఖర్చులు వ్యవసాయానికంతకూ యాభై అవుతుంది. లెక్కలన్నీ చూసుకుంటే పన్నులు, మామూళ్ళు, మళ్ళీ తిరిగి దాని చేబదుళ్ళు, వాటికీ వీటికి సహాయాలూ అన్నీ పోతే అతనికి సాలుకు నూరు, నూటయాభై రూపాయలు మిగులుతున్నాయి ఈ పదేళ్ళలో తన పొలంలో రూపాయి కాసులుగా మార్చుకొని, ఎక్కడ దాస్తాడో బచ్చులయ్యకు పన్నెండువందల రూపాయిలు పోగయ్యాయి.

## ౪

బచ్చులయ్యకు అరవైఏడో ఈడు వచ్చింది అతనిది విజయనగరం పక్క గ్రామం. ఆరోగ్యం ఎప్పుడూ చెడలేదు. కాని బచ్చులయ్యకి ఆ వేదన ఎక్కువైంది. తన కూతురు 'పొలం లచ్చిమి' పెద్దదయింది. ఈడు వచ్చింది. ఈ అమ్మాయిని ఎవరికిచ్చి పెళ్ళిచేసేది. మంచి సంపాదనపరురాలు ఇవాళ కాకపోతే తన తదనంతరమున్నా ఎవరో అమ్మాయిని పెళ్ళి చేసుకోవలసిన వారే!

తానూ పెద్దవాడవుతున్నాడు. విశాఖపట్నం సీమవాడు అతనితాత. అతని చుట్టాలు ఉండీ గ్రామంలో చాలామంది ఉన్నారు. ముఖ్యంగా తన అక్క అప్పలమ్మ, తన మేనల్లుడు సోమన్న ఉన్నారు. తన అక్క మొగుడు పోయినవెనక కరణంగారింట్లో పనిచేసుకుంటోంది. మేనల్లుడు పెద్ద కాపు సుబ్బన్న నాయుడు గారికి పాలేరు కాని ఆ కుఱ్ఱసంక ఇరవై అయిందే ల్లొచ్చి పెళ్ళాన్నొదిలేసి, ఉండి కాల్వం తెన పక్కకొత్తగా పెట్టిన పాటలులో ఓ అమ్మాయిని మరిగాడు.

అలాంటి ఎదవకు తన కన్న తల్లిని, తన బంగారుబొమ్మను 'లచ్చిమి'ని ఇస్తే దాన్ని గంగలో కలిపేస్తాడు కదా! అనుకున్నాడు.

ఆ వేసవి రాత్రి బీరపాదులుపెట్టిన తన పొలంలోకి వెళ్ళి ఓ గట్టు మీద కూర్చున్నాడు.

« ఓలమ్మో లచ్చిమీ! ఏటంతవు? నిన్నింతదాన్ని చేసి పెంచుకొన్నా! నీకు పెళ్ళిచేసుకపోతే ఏటనుకుంటుంది లోకం? »

ఇంతలో ఆ పొలం కన్నె పద్నాలుగేండ్ల బాలికలా వచ్చినట్లయింది అతనికి. ఆ అమ్మాయి వచ్చి అతని పక్క కూచుంది.

లచ్చిమి :- ఓగయ్య, నేనేట నేది. నాకిప్పుడేటి పెళ్ళి! యారవన్నా నవ్విపోతరు. అందులో ఓయిబాబూ! ఏ దొంగగాడవన్నా నా మొగుడైతే నాతిప్పలా సింహాదిరప్పన్న కూడ సయించలేవంత అయిపోతది బాబూ!

పచ్చలయ్య :- నాకన్నతల్లివి గావంటో?

లచ్చిమి :- అయ్యా! మంచి మొగుణ్ణి నానే ఏరుకుంటాను గాదేంటి?

పచ్చలయ్య :- ఎప్పుడేగానంతవులమ్మా!

లచ్చిమి :- బాబూ! నీకెందుకంత గొడవ, నానే సెపుతాను గాదంటారి!

పచ్చలయ్య :- నానెల్లి తొంగుంటాలమ్మా!

లచ్చిమి :- బాబూ నువ్వుతొంగో నేను నూతో ఉంటానులే!

ఈ సంభాషణ అతనికి ఏ మాత్రమూ అనుమానం లేని నిజం. పచ్చలయ్య సంతోషంతో వచ్చి నిద్రపోయాడు.

లచ్చిమి ఆ వెన్నెట్లో అలా పవ్వళించి కన్ను మూసింది.

౫

ఆ మర్నాడు పచ్చలయ్య మేనల్లుడు సోమన్న భార్య పైడమ్మ పచ్చలయ్య దగ్గరకు వచ్చింది

పైడమ్మ:- బాబూ నీ అల్లుడి యిసయం అంతకన్న అంతకన్న ఎక్కువాతోంది బాబూ! నిన్న రేతిరి, తాగి ఇంటికాడకొచ్చినాడు ఇంటికాడ మా అత్తతో దెబ్బలాట ఏసుకున్నడు ఆ కళంగా కోపంతో వచ్చి, నన్ను సావగొట్టి, తూలి పడిపోయి, ఈత దుమ్ము సాగు కుబ్బి నిదరోయాడు. బాబూ నువ్వేతప్ప ఆడిని మంచిదారినోకి ఇంకెవురు పెడతారు చెప్పూ!

పచ్చలయ్య:- పైడమ్మా! నీవన్నదంతా సత్తెమే! నానువాతిరి మేటి చేసేది తల్లీ! భగమంతుడు రచ్చించాలి. నువ్వెల్లి ఏ అమ్మవారికో దణ్ణాలెట్టుకుంటూ ఉండంతే!

పైడమ్మ:- బాబూ నన్ను సంపెత్తడు నీ అల్లుడు. నాకు బయమేత్తదయ్యా! నిన్న రేతిరి పెద్ద కత్తుచ్చుకొని, 'నంజా! పెతివోడి పక్కనోకి యెడతా ఉన్నావా, నిన్ను సంపేసి, నాను సంపేసుకుంతను' అని ఆ కమ్మ కత్తి వాక్కొని నాకాడికొచ్చినాడు. యేటి సేయమంతవు పచ్చలాయి బాబూ!

పైడమ్మ కళ్ళు మహానదులు ప్రవహిస్తుండగా కుళ్ళిపోయింది. పచ్చలయ్యకి పట్టుక్కున తన లచ్చిమిని సలహా అడిగితే. ఆమే సరియైన మార్గం చెప్పాలి తనకని ఆలోచన తట్టింది. తిన్నగా పొలంలోకి ఒక్కడూ పోయాడు ఆ పచ్చనిపొలం 'ఏటిబాబూ, ఆడికి నానే బుద్ధిసెపుతాగా దా!' అని జవాబిచ్చినట్లయింది. తిన్నగా తన పాకలోకొచ్చి "పైడీ! ఎల్లి, మా అక్కను నానురమ్మంతున్నానని తీసుకురాయే! మా అక్క, నువ్వూ ఇక్కడే నాలుగు రోజులపాటు ఉండురుగాని" అని ఆమెను పంపించినాడు

పైడమ్మ వెళ్ళి ఒక గంటలో, తన అత్త అప్పలమ్మని తీసుకు చక్కా వచ్చింది.

౬

ఇంటికొచ్చేటప్పటికి పైడమ్మా కనబళ్ళేదు, తల్లి అప్పలమ్మా కనబళ్ళేదు సోమన్నకు! తాగి ఉన్నాడు. కళ్ళు ఎఱ్ఱచేసుకుని పక్క పూరింటిలోని ముసలిదాన్నడిగాడు.

“ అల్లు  నీ మామింటికి పొలంపోయాడు సోమన్నా ” అన్నది ముసలిది.

“ ఏటీ! ఎళ్ళాడా. ఆ ముసలొదవదగ్గిరికి? అణ్ణి పంపేసి, నాను సంపేస్తాంతా ” అంటూ దుడ్డుకర్ర పుచ్చుకొని మేనమామ పొలానికి తన పేట నుంచి, ఎల్లా తూలుతూ, కేకలేసుకుంటూ, ఉండీనుంచి. ఉండీ అగ్రహారం పొలిమేరకు కాలవగట్టునే నడుస్తూ వచ్చాడు రెండు మూడు సార్లు పడ్డాడు లేచాడు. మళ్ళీ సాగినాడు.

ఉండీ తూరుపువాపుల గూడెంలో సోమన్న మామని చంపేస్తాడేమోనని అల్లరి బయలుదేరి పెద్దలూ, పిన్నలూ కదిలారు కర్ర పుచ్చుకొని పచ్చలయ్య పొలానికి పడక సాగినారు గుంపు చట్టాలు వెలిగించారు కొందరు కర్రవాళ్ళు ఓడీలు వేగిరించారు జట్టులో రామన్న సిగరెట్టు వెలిగించాడు

వాళ్ళంతా పచ్చలయ్య పొలం దగ్గిరకు వచ్చి, కాల్వలో దిగి, దాటి అవతలిగట్టునే ఉన్న పచ్చలయ్య పొలంగట్టుమీదకు వెళ్ళి “ పచ్చలయ్యా ” అని పిలిచారు. ఆదివరకే వాళ్ళందరూ వచ్చే ఈవతలి గట్టునుంచే “ పచ్చలయ్యో! ” అని వాళ్ళు కేకలువేశారు.

వాళ్ళందరు తన పాకన్న పొలం గట్టుమీదకు రాగానే, పచ్చలయ్య నిద్రలేచి “ ఏటిరా అది! అల్లాగ కేకలేస్తున్నారని ” అంటూ పైకివచ్చాడు పెదమ్మ, అప్పలమ్మ పైకివచ్చారు

ఒకడు :- సోమన్న ఇక్కడకు రాలేదుగా మావా?

పచ్చలయ్య :- రాలేదురా! ఆశేమయ్యాడేంటి?

ఇంకొకడు :- ఏమో నిన్ను సంపేస్తానని ఇక్కడకు బయలుదేరినాడంట

పచ్చలయ్య :- ఏమై ఉంటాడు మీకు దారిలో కానపడలేదంట్రా?

మొదటివాడు :- ఉబ్బే!

ఇంతట్లో పెదమ్మ హరికేన్ దీపం వెలిగించి తీసుకొని, వచ్చింది. అందరూ సోమన్నను వెదకడానికి బయలుదేరి, ఒకవేళ, వంతెనదగ్గిర అవలి ఒడ్డుకు దాటివస్తూ, తాగి ఉన్నాడు గనుక, దారిలో పడిపోయి ఉండవచ్చునేమో అని ఆలోచించారు దీపం పుచ్చుకొని, ఒకడు ముందు నడిచాడు, తర్వాత అందరూ బయలుదేరారు.

నాలుగు అడుగులు వేయగానే, వెనకవచ్చే ఒక పసులవానికి పచ్చలయ్య పొలంలో ఏదో తెల్లగా పడిఉన్నట్టు కనబడింది. “ అదేటో నూ

సొత్తాను," అని లాంతరు పుచ్చుకొని పొలంలోకి దిగి, ఆ వస్తువు దగ్గరికి వెళ్ళి చూసీ చూడడంతోనే ‘ఓరి రండల్లో, ఇక్కడ పడున్నాడు సోమన్నగాడో’ అని కేకేశాడు. అందరూ పొలంలోకి పరుగెత్తారు.

ఆ పొలంలో ఒళ్ళు తెలియకుండా, సోమన్న పడివున్నాడు

పచ్చలయ్య వంగి, సోమన్న గుండెలో చేయిపెట్టి చూచాడు. గుండె దడ దడ కొట్టుకుంటోంది

“ఈడికి మత్తు తప్ప మరేం జబ్బు లేదబ్బా” అన్నాడు. ఇద్దరు సోమన్నను పైకెత్తి పొలంలోంచి పచ్చలయ్య పూరింటిదగ్గిరకు తీసుకువచ్చారు.

పచ్చ:- అణ్ణి అల్లా తొంగోబెట్టి మీరెల్లండబ్బా! మీకు నా దండాలు.

మొదటి:- ఈ కుంకన్నగాడికి మెలకువ వత్తే, అల్లరిసేత్తాడేమో పచ్చలాయి!

పచ్చ:- మెలకువ తెల్లారిందనకా, వస్తుందా? రచ్చాలాగినోణ్ణి ఈణ్ణాంటి పదిమందిని మడతలేసి సితక మొడిసెయ్యగల్ను.

రెండవ:- ఓరి యొంకటసామి, పచ్చలయ్య, మొన్న కాలవలో మెర కట్టిన పన్నెండు బత్తాల నావను తలకాడెత్తి, ఎనక్కునెట్టిన సంగతి యొరగవేట్రా!

వారందరు కొంచెంసేపు ఆ కబుర్లూ, ఈ కబుర్లు సెప్పుకొని, పచ్చలయ్య అప్పలమ్మలదగ్గిర సెలవు పుచ్చుకొని తమపేటకు వెళ్ళిపోయినారు.

## ౨

తెల్లారిన రెండుగంటలకు సోమన్న లేచినాడు. తానెక్కడనున్నదీ సోమన్నకు తెలియలేదు. చేతులలో తల పట్టుకొని ‘నా ఎదవ మతి! ఎక్కడున్నానేంటి?’ అనుకున్నాడు. అతనికళ్ళు తిరిగి మూతలుపడిపోయినాయి. కాని ఒక్కసారిగా అతనికి పూర్తిగా మెలకువ వచ్చింది.

తాగిఉన్న అంతమత్తులోనూ, రాత్రిజరిగిన ఒక సంఘటన గుండెను గుద్ది చెప్పినట్టుగా జ్ఞాపకం వచ్చింది. తాను తెల్లవారు పొలం దగ్గరకు వచ్చాను గట్టు తప్పి పొలంలోకి వెళ్ళాడు. అప్పుడెల్లావచ్చిందో నిళ్ళల్లో పడినట్లే మెలకువ వచ్చింది. ఈ పొలం రాత్రి ఎంత అందంగా కనబడింది. “ ఆ కాపీహోటలు పిల్ల, దొంగనాసంజ నానెల్లెపక్కి, ఆడెవడిపక్కనో తొంగుతుంది. ఓలబ్బో మాచెడ్డకోపమొచ్చేసి అల్లిద్దరినీ సంపేసేద్దామని మీద పడేటప్పటికి, ఆ కొత్తోడు నెగిసి సావగొట్టి, యిసిసిపెట్టాడు. ఈ సిపాగరు ఇల్లా ఉందిరా అని, నానెళ్ళి సారాయిదుకాణంకాడ రెండుబుడ్లు లోనేసి, కత్తికోసం ఇంటికెళ్ళాను. ఆ తరవాత నాకేం తెలుసు, మామపొలంలో ఉన్నానుగందా ఆ పైన నాకు చటుక్కున తెలివొచ్చి సూత్తే మామ పొలం. అది పొలమేటి, అది బంగారుపిల్ల కాదంటారా, ఆ సీకటంతా ఎన్నెలే అయి పోయింది. ఆ పొలం సూత్తే మామ ఎంతదేముకంటివాడో గ్నాపకం వచ్చి, మా దుక్కం మేసి పొలంలో పడిపోయి యేడిసినాను గందా! ఆ తర్వాత నాకు నిదరే వట్టేసింది. ” అని తనచుట్టూ చేరిన పచ్చలయ్యతో, పైడమ్మతో అప్పలమ్మతో సోమన్న సిగ్గుపడుతూ చెప్పాడు.

సోమన్న :- మామా! ఏటి నే యిమంతవు, రాత్రి నీ పొలంలో కాలెట్టినా! అంత దుక్కమొచ్చిందేటి ?

అప్పలమ్మ :- ఒరి కుంకనాన్న కూన పొలంలో కతుగట్టడానికి నీకేమి అక్కుండిరా ?

పచ్చలయ్య :- నీకిట్టమొత్తే, నా పొలంగట్టుమీద నీ బారియతో నుండు, యేరే సిన్నిల్లేసుకుందాం. నానూ, మా అక్కా మా ఇంటిలో ఉంటాం.

అప్పలమ్మ :- రోజూ తాగొచ్చి, పుత్తే గట్టిన పుత్తడి బొమ్మలాంటి పిల్లదాన్ని కొట్టే చచ్చుకుంకని ఇక్కడ కాపురమేటిరా తమ్ముడా!

పచ్చలయ్య :- నా లచ్చిమి ఈను తాగొత్తే ఇక్కడకు రానిత్తాదనే నీ ఉద్దేశం ?

పైడమ్మ :- బాబూ నీకింక సాకిరి సేసుకుంటూ పడుంటాను. ఆను నన్ను యింపేత్తావని భయంకాను. ఆ తాగొచ్చినప్పుడాడ నేటి మాటలు రామ సెంగా,! పాపం వోరంగం కుంత్తాదికందా !

౮

సోమన్న సిగ్గుపడి లేచి ఆ పొలం మాలక్ష్మిలోనికి నడిచిపోయాడు. అక్కడ ఒక్క మడిగట్టుమీద కూర్చుండి, ఏదో ఆలోచనలో పడినాడు.

తనమామ ఈ పొలానికి 'లచ్చిమి' అని పేరెట్టుకున్నాడు, ఎంత సక్కని పేరు. ఎంతసక్కని పొలం. తనమామ పచ్చలయ్య దేముడంటివోడు. ఎన్నిసార్లు తనకూ, తన కుటుంబానికి సాయం రాలేదు. అంత ముసలోడు ఆ పనేంటి, ఆ సగితేంటి ?

లచ్చిమీదేవే ఈ పొలం. తాను ఈ లచ్చిమీదేవి దగ్గిర నుంచోడానికైనా తగడుకందా ! ఈ పొలం లచ్చిమిని కావులించుకోవాలి. తన మావ తన కూతురంటూ ఈపొలాన్ని అనపైడి నిజంగా పైడిబొమ్మే ! ఎన్నిమార్లు తాను దాన్ని ఏడిపించలేదు. ఊరుకున్నిండా, మలకున్నిండా ఎంత ఒగితిలో తనకూ, తినమ్మకూ చాకిరీ సేత్తుందికాదు. ఆ దిగమడిచిన ఓటలు సరుకు, తన పైడికి మైలు దూరంలో నుంచోడానికి వోల్లా? ఆ సచ్చు సరుకులు ఈ పొలం లచ్చిమికి రావడానికి వోల్లా !

"ఏటితిడికి పోగాలం. ఎదవ తాగుడు. మా అయ్యఎప్పుడైనా తాగినాడా. సంపాయించిన ఎకరా పొలం నేను మునసబుగారి కమ్మేసినాను గందా ! తల్లీ పొలం మాలచ్చిమీ అంటేనన్ను రచ్చిత్తాది. లేదంటే నాకూ దానికీ ఏమి సమ్మంధం.

"పెళ్ళాం మెళ్ళోగల్లలు తాకరమ్మగోరి వోళ్ళో ఏసేసినాను.

"పొలం లచ్చిమీ ! కుక్కతుకు బతికినాను, నన్ను రచ్చించాలి."

ఆ పొలం బాలిక నవ్వినట్లుంది సోమన్నకు. ఆ పొలంలో పాగి కడ్డాను సోమన్న. అతని కళ్ళవెంట ఉండీ కాల్వలు నూరు ప్రవహించాయి.

పొలం లచ్చిమి చిరునవ్వు నవ్వి "లే సోమన్నా! నన్నూ, పైడమ్మను ఆపేచ్చతో సూత్తానని మాటిచ్చ్య్య మాటతప్పావా! నువ్వు వాళ్ళ పైపోతవు కాలకితి అలాటిని మామమాట తప్పక బుద్దితో మసలు. నేనూ, పైడమ్మా నీ కిద్దరం పెళ్ళాలం" అని పలికినట్లు అతని హృదయానకు తట్టింది.

౯

చిరునవ్వు నవ్వుకుంటూ, కళ్ళనీరు కారుస్తూ సోమన్న మేనమామ కాళ్ళమీద పడ్డాడు. "మామా! మా బాబుపేగ సాచ్చి, నువ్వు సెప్పింది ఇనుకుంటా! ఈ పొలం పొలిమేర దాటి ఎళ్లితే నన్ను బలెయ్యి!" అన్నాడు.

అతని మాటలలో సత్యవాక్కు వారి హృదయాలలో మారుమ్రోగినది.

అప్పలమ్మ సింహాద్రప్పన్నా నీ దయ అంది. పచ్చలయ్య పాలచ్చిమి నువ్వు బర్త సేయుతున్నావా తల్లీ అనుకున్నాడు. పైడమ్మ ముసిముసి నవ్వులు నవ్వుకొని, పైట సర్దుకొంది. పొలం కన్నె, లచ్చిమి సిగ్గుతో తనపైట తాను సర్దుకొంది.

*

# అసుర కన్య

## మొదటి భాగము

### ౧

కక్షీవంత మహాఋషి కుమారుడు సుధన్వుడు సూర్యాశ్వంలా బలిష్ఠుడు, ఇంద్రునివలె ఆజానుబాహుడు.

అతని నవ్వులు అశ్వినీ నక్షత్రంతో చేరిన రాకాచంద్రుని కిరణాలు. అతని కోపము ఆరుద్రాయుక్తాదిత్యమాస మేఘున త్రిత కంపాలవలె జాజ్వల్యమానమైంది. సుధన్వుని సౌహార్ద్రము కమలదళశీతలము.

అతని ధనుర్విన్యస్త శరము ఇంద్రవజ్రసమము. అతని యుద్ధసాయకత్వము వృత్రాసుర నిషూదకులైన ఇంద్రవిజయిత్వంవంటిది.

పవిత్ర మంత్రద్రష్ట కక్షీవంతుడు తన కుమారుని దస్యుమారుడితడే అని ఆశీర్వదించాడు

తల్లిదండ్రులకు మ్రొక్కి అనుమతిపొంది ఆర్యసైన్యాలను నడుపుకొంటూ సింధూనదీ తరంగాలను నావలలో దాటాడు సుధన్వుడు. పర్వతాలు దాటి, అసుర దేశంలో విడిదిచేసి అసురరాజును యుద్ధానికి పిలిచాడు.

అసురులు ఉత్తమ నాగరికులు, మిత్రావరుణాది దేవతా భక్తులైన ఆర్యులకు విరోధులు. ఆర్యరాజైన సుధన్వుడు ఉత్తమవీరు లధివసించి ఉన్న రథాలలో, గాలిలో ఎగిరే ఉత్తరీయాంచలాలు కలిగిన అశ్వికులతో తమ

ఇంతలో రెండు సైన్యాలు తలపడినవి. అసురులు మహాబలులు దృఢకాయులు, ఆర్యులు మగటిమిగల బంటులు, అసురార్యులు ఒకే రూపురేఖా విలాసాలు కలవారు. ఆ వంశాల సమరంలో కవచాయుధాలలో మాత్రం భేదాలున్న ఆ రెండు సైన్యాల వీరులు పాలసముద్రంలో సుడిగుండంలోని కెరటాల వలె పోరు సల్పినారు.

పోరు ఘోరమైంది. శరఝాంఝల్ల ఖడ్గకాంతులు, ముసలముద్గర పరశు గదాద్యాయుధ తాడన నినాదాలు ఇంద్రుడు మేఘాలతో ఆకాశాన అవతరించినట్లే అయినది.

పాంచర తండ్రి ప్రక్కనే ఉండి, తండ్రినీ తన్నూ కాపాడుకొంటూ భయంకరయుద్ధం చేస్తూ ఉన్నది.

అంతలో అసురార్య యుద్ధనాయకులిర్వురూ ద్వంద్వ యుద్ధాన ఒకరినొకరు మార్కొన్నారు.

## 3

యుద్ధారంభం నుండీ సుధన్వుడు మేఘాలను దూరివచ్చే వజ్రపాతంలా పొగమంచును చీల్చివచ్చే సూర్యకిరణాలలా, అసుర సైన్యాలను చొచ్చి, శంఖం పూరిస్తూ, తన సైన్యాన్ని చేయివిసిరి, విజృంభింపచేస్తూ, అసురనాయకుల తీక్ష్ణ బాణాలతో, వివిధాయుధ ప్రయోగాలతో నిరసిస్తూ, పూలతో నిండిన మోదుగ చెట్టులా రక్తసిక్తాంగుడై, ఏమీ చలించకుండా వేగంతో యుద్ధవిశ్రాంతుడైనాడు.

అతడు మహావేగంతో అసుర వ్యూహం ఎవ్వడు కనిపెడో, ఆ క్షణమే చక్రరక్షకులైన ఆర్యసైన్యాల చెండాడే ఉషోదేవిలా ఉన్న పాంచర ముందుకు వచ్చి సుధన్వుని తలపడింది.

ఆర్యరాజా బాలకునివలె నున్న పాంచరను చూచినాడు. బాలుడే అనుకున్నాడు. సుధన్వునకు పాంచర పదునాలుగేండ్ల బాలికవలె తోచింది.

సుధన్వుడు :- ఓయి బాలకా, నువ్వు చిన్నవాడవు, నీ తండ్రి పెద్దవాడు. మీ కేతనము మాకు లొంగినట్లు ఒకసారి దింపండి, మీరూ మేమూ సమాధానం కుదుర్చుకొని ఎవరిదారిని వాళ్ళు పోదాంగాక !

పాంచర :- ఓయి ఆర్యవీరుడా ! యుద్ధం చేసి అలసిఉన్నావు. నీ కవచంలోంచి రక్తం సూర్యరథానికి ముందు ప్రసరించే ఎఱ్ఱని కాంతి ధారల్లా ప్రవహిస్తూ ఉంది. నువ్వే నీ పతాకాన్ని దింపినట్లయితే, నువ్వు నీ దేహం బాగుపడేవరకూ మా కోటలో అతిథిగా ఉండవచ్చును. మీ సైన్యాలు మా రాజ్యానికి అతిథులు.

సుధ :- ఓయి పుణ్యమూర్తీ నీ మాటలు మధురాలు కరిగే కలకంఠి కంఠసవిత గాన స్వరాలులా వినబడుతున్నాయి. ఇంత చిన్నతనంలో నీకు యుద్ధమేమిటయ్యా ?

పాంచర :- ఓయి యుద్ధమే జీవితం చేసుకొన్న కర్కశుడా! నీకు బాలుడెవరో, బాలిక ఎవరో తెలియదో ? ఇవిగో నా బాణాలు రుచిమాడు. ఇవి వాలుచూపులు కావు. ప్రాణాలుహరించే తూపులు సుమా !

౪

సుధన్వుడా బాల సౌందర్యానికి ఆనందంచే ఉప్పొంగి పోయాడు ఈ బాలవీరుడు బాలికా ? ఓహో ఏమా బాలికా సౌందర్యము? ఆ సౌందర్యము భూమిమీదున్న వనక విత్తులు జల్లగా ఇంద్రదేవుడు తన మేఘాలచే చల్లని వృష్టి కురిపించి నప్పుడు, బయలుదేరిన పచ్చని మొక్కలతో నిండిఉన్న పొలంలా ఉన్నది;

ఆ బాలిక అందము, వెన్నెల ప్రసరిస్తుండగా, ఆ వెలుగులోని అమృతం ఆస్వాదిస్తూ తీవలు సారించిన. దేవతలకు అతిప్రియమైన సోమలతలా ఉన్నది;

ఆ బాలిక మనోజ్ఞత్వము హిమాలయ శిఖరాల పుట్టి గీతాలాలపిస్తూ లోయలలో ప్రవహించే వితస్తానది ప్రవహింపులా ఉన్నది. సుధన్వుడు ఈ ఆలోచనలు తన హృదయాన్ని వెన్నెల్లు నింపగా తన రథంమీదనుంచి దిగ్గనురికాడు. అతడా రథముమీదే ఖడ్గాలు విడిచినాడు, అతడు ఆ రథంమీద నుంచి యజ్ఞభాగం భోగించడానికి ఆకాశంనుంచి దిగివచ్చే మరుత్తునిలా ఉన్నాడు.

అతడు తనమీద పడే అసురుల బాణాలు లెక్కచేయులేదు. అతడాయుధాలన్నీ రథంమీదనే ఉంచివేశాడు. అతని చిరునవ్వు మోము, అతని వెలిగిపోయే ఫాలం, అతని విశాలమైన కన్నులు, అతని సమున్నత మూర్తిత్వము, అతని విక్రమము. అతని అశ్వినీదేవ సౌందర్యము. అసురవీరుల్ని సమ్మోహం పరచింది. అసుర వీరులందరు యుద్ధము మాని, అతనివైపే చూస్తూ ఉండిరి. ఆర్య నాయకులూ యుద్ధం మానివేశారు.

పాంచాలనైపు చూస్తూ “ఓ దివ్యసౌందర్యరాశీ, ఓ ఇంద్రాణివంటి పరాక్రమం కలదానా, నిన్ను వాయుదేవుడు మేఘాలనుకొని పోయినట్లుగా నా సప్తసింధు దేశానికి కొనిపోగలను. ఓ అనన్యదివ్య మనోహర రూపం కల అసురకన్యా! ఓ బాడబివంటి తేజస్సుకలదానా నిన్ను ఆదిత్యుడు బాడబియైన సంజ్ఞాదేవిని సముద్రంలోనుంచి కొనిపోయినట్లు కొనిపోగలను.” అని ఉచ్చైస్స్వరాన్ని కేక వేసి, సముద్రకెరటంలా కదిలాడు, సింహంలా ముందుకు సాగాడు.

“ఓ ఆర్యకుమారుడా! రావయ్యా నా దగ్గరకు, నేనే నిన్ను జయించి, నిన్ను నా ప్రియుణ్ణి చేసుకొని, తన హృదయంలో యామినిచంద్రుణ్ణి దాచుకొన్నట్లు నిన్ను దాచుకొంటాను ఓ మిత్రునివంటి పరాక్రమం కలవాడా, ఓ అగ్నివంటి తేజస్సుకలవాడా, మంచి గంధం తరువు అగ్నిని దాచుకొన్నట్లు నిన్ను నా హృదయంలో దాచుకోగలను” అని కేక వేస్తూ గుజ్జూనైపై, రక్తశిక్తాంగియై పూవులుపూచిన పలాశ వృక్షంలా అధివసించి ఉన్నది.

తమ రాజకుమార్తెకు అడ్డంవచ్చిన అసురవీరుల్ని సుధన్వుడు లెక్క చేయక ముళ్ళకొంకలను విదల్చుకొనుచు తన ప్రియురాలైన ధేనువును కలిసికొనబోయే అడవి వృషభంలా, అవతలి ఒడ్డున ఉన్న తన రాణిని చేర మహాప్రవాహం వద్దకు ఎగురుకొనిపోయే ఐరావతంలా, అతడు అసురసైన్యాలను ఈవలావలకు నెట్టివేస్తూ పాంచరి దగ్గరకు చేరినాడు.

పాంచరి మహోత్సాహాన నవ్వుతూ, తన నిశిత ఖడ్గాన్ని మొగము వైపు త్రిప్పి సుధన్వుడు నిరాయుధుడై ఉండటంచేత, మెరుపు వేగంగా అతన్ని ప్రహరించడం ప్రారంభించింది.

సుధన్వుడు తనతలమీద శిరస్త్రాణం పెట్టి, ఎడమ ముష్టితో మహావేగంతో విరచే ఆమె ఖడ్గ ప్రహారాలను ఆ శిరస్త్రాణంపై పడేటట్లు, ఆమెను ఏమరపించి, కుడిచేతో ఆమె కుడిచేయి పట్టుకొని ఖడ్గంలాగి ఆవలకు విసరివైచినాడు:

ఇంద్రునివలె బలంగలవాడున్ను, అశ్వినీ కుమారులవలె అందగాడును, సవితృనివలె కాంతిమంతుడును అగు సుధన్వుడు ఆమె నడుముచుట్టూ చేతులు వేసి అశ్వాన్నుండి ఎత్తి తీసి ఆమెను గాఢంగా తన హృదయానికి అదుముకొన్నాడు.

ఆమె సంతోషాన మునిముసినవ్వులు నవ్వుతూ ఆ దృఢపరిష్వంగంలో ఇరికిపోయి, అసురవీరులు చూచి ఆశ్చర్యం పొందుతూ ఉండగా, తండ్రి అయిన అసురరాజు నివ్వెరగంది చూస్తూ ఉండగా, రెండుచేతులా అతని చెంపలు పట్టి అతని కళ్ళల్లోకి తేరి పార చూచినది.

ఆమె చూపులు వెన్నెలకిరణాలు మానస సరోవరంలోతుల లోనికి ప్రసరించినట్లయినది. ఆమె చూపులు కల్పవృక్షంపైన అమృత వర్షం కురిసినట్లయినది.

అతడామెను చూచి "ఓ హృదయేశ్వరీ! ఓ అసుర మహారాజ బాలికా, హిమాలయ పర్వతాగ్రాలు మేఘాలను ధరించినట్లుగా నిన్ను నా

హృదయంలో ధరిస్తున్నాను. నీ స్మరణామంత్రము కచుడు శుక్రుని కడ గ్రహించిన మృతసంజీవినిలా మన ఉభయసేనలకు అమృతత్వం ప్రసాదించు గాక!" అని అంటూ ఆమెను పెదవులపై ముద్దుకొన్నాడు.

పాంచగ గాయత్రి మంత్రంలాంటి పవిత్ర స్వరయుక్తంగా నవ్వింది ఆమె సుధన్వుని హృదయంలో తన మోము దాచుకుంది.

ఇంతలో సాయంకాలమూ ఆదిత్యుడూ, అతని వెలుగూ సముద్రంలో మునిగిపోయిన రీతిగా, దివ్యపరిమళావృతమైన పూవు చెట్టునుండి రాలిపోయిన రీతిగా, పాంచర కౌగిలిలో సుధన్వుడు ఆ యుద్ధభూమిలో కూలిపోయినాడు.

సుధన్వుని ప్రాణాలు పాంచర ప్రాణాలు ఆ అమృత మృతిలో లీనమైపోయినవి.

అసుర సైన్యాలలో, ఆర్య సైన్యాలలో హాహాకారాలు మిన్నుముట్టినాయి.

# రెండవ భాగము

## ౧

అహమ్మదాబాదు కాంగ్రెసుకు ఆంధ్రదేశాన్నుంచి ప్రతినిధులుగా వెళ్ళినవారిలో డాక్టరు వైకుంఠరావు ఎం. బి. అండ్ సి. యం. ఒకరు. వైకుంఠరావు మాంచి ఉత్సాహంగా వున్నమనిషి. ఆటల్లోనైతే అందె వేసిన చెయ్యి. మద్రాసు వైద్యకళాశాల ఆటజట్టులన్నిటికీ నాయకుడు. విద్యార్థులలో, మేటియైన టెన్నిస్ ఆటగాడు. న్యాయకళాశాల, పచ్చయప్ప కళాశాల, క్రిస్టియన్ కళాశాల, ప్రెసిడెన్సీ కళాశాలల జట్లలో ఒకటిరెండు అతడు కాలేజీవిద్యార్థిగా ఉన్నంతకాలం కాల్బంతి, హాకీబంతి, టెన్నిస్ ఆటలలో వైద్యకళాశాలతో పోటీచేసి మొదటిరంగమైనా దాటలేక పోయాయి.

ఎన్నివేల సంవత్సరాలనుండో భారతదేశంలో విజృంభించిన ఆర్య వీరుల వీర్యమూ పరాక్రమమూ అతనిలో మూర్తీభవించాయిరా అనేవారు అతని స్నేహితులు.

నలుగురు స్నేహితులతోటి ప్రతినిధులుగా స్వగ్రామమైన గుడివాడ నుండి బయలుదేరి బెజవాడ, సికిందరాబాదు, ఎల్లోరా, అజంతా, జాల్గాన్, బార్డోలీలమీదుగా అహమ్మదాబాదు చేరుకున్నాడు.

అహమ్మదాబాదు కాంగ్రెస్లో కుర్చీలూ బల్లలూ లేవు. అందరూ ఆ మహాశిబిరంలో క్రింద కూర్చోవలసిందే. ఒకవైపు ఖిలాఫత్ మహాసభ ఒకప్రక్క స్వదేశవస్తు,ఖాదీప్రదర్శనము, దేశ దేశాలనుండి వచ్చిన లక్షల

కోలాహల జనం. అక్కడే సబర్మతీ నదీతీరాన్ని మహాత్ముని ఆశ్రమం అహమ్మదాబాదు ఏనాటి భారతీయ మహోత్కృష్ట గాథలనో స్మరింప చేస్తున్నది.

భారతదేశం తనకు త్వరలో విముక్తి వస్తున్నదని పవిత్ర ప్రపంచ ప్రఖ్యాత అపర అహింసావతారమైన మహాత్ముని చూస్తూ మురిసిపోతున్నది.

ఆ వైభవం స్నేహితులతో చూస్తూ భారతదేశంలో జరగబోయే అఖండ సత్యాగ్రహ యుద్ధానికి మహాత్మునికే నాయకత్వమిచ్చి, శ్రీ శ్రీ హకీం అజ్మల్ ఖాను గారి యాజమాన్యాన కాంగ్రెసు తీర్మానం చేసింది.

వైద్యశాలలో వైకుంఠరావు ఆఖరు సంవత్సరం చదువుతూ ఉండగా మహాత్ముని దివ్యవాక్యాలు భారతదేశమంతా మారుమోగాయి. వైకుంఠరావు ఆ క్షణమే కళాశాల వెడలి పైకి వచ్చేద్దామనుకున్నాడు. కాని ఇంక మూడు నెలలు ఓపిక పట్టి పరీక్షతో స్వరాజ్యంకోసం తాను నిశ్చయించుకొన్న కార్యక్రమం మానివేసి విడిగా వైద్యవృత్తి చేసుకుంటూ కాంగ్రెసు కార్యక్రమంలో పాలుగొంటూ ఉండాలని వైకుంఠుడు నిశ్చయం చేసుకున్నాడు

నాగపూరు కాంగ్రెసుకు వెళ్ళాడు. అప్పటికి అతడు హౌసుసర్జను పనిలో ఉన్నాడు. ప్రసూతివైద్యమూ, కళ్ళవైద్యం పూర్తిచేసి గుడివాడలో వైద్యవృత్తి ప్రారంభించాడు. ప్రారంభించిన మూడు నెలలలో వైకుంఠునికి నెలకు ఆయిదారువందలు దొరుకుతున్నాయి.

ఈ కారణాలన్నిటిచేత ఇదివరదాకా పెళ్ళిమాట తలపెట్టక, ఇప్పుడు పెళ్ళిసంగతి తర్వాత చూసుకోవచ్చునులే అని ఊరుకున్నాడు.

## ౨

అహమ్మదాబాదు కాంగ్రెసు అద్భుతంగా జరిగింది. అక్కడినుండి స్నేహితులను "అబూపోయి దిలావరా గుళ్ళను చూచి వద్దాం రండర్రా" అని ప్రోత్సహించాడు వైకుంఠరావు.

ఢిల్లీ మెయిల్ అబూరోడ్డు స్టేషనులో దిగారు మనవాళ్లందరూ. ఆ బండిలోనే ఆ సమయంలోనే మొదటితరగతులోనుంచి తహిమీనా బాట్లివాలా కన్యయూ, ఆమె తండ్రి బాట్లివాలా గారూ కూడా మెయిలులో ఒక మొదటితరగతిలోంచి దిగారు.

తహిమీనా కన్య పార్సీబాలికలలో దేవకన్యలాంటిది. గులేబకావలీ కన్యకు అందాలు నేర్పనోపారాంగి.

తహిమీనా ఇంగ్లండులో చదువుకుంది ఆంగ్లబాలురు వారివయస్సులోనే వారిని తోసి రాణీ చేసింది. ఆమె ఎం. ఏ; పియచ్. డి. పరీక్షలలో మొదటగా జయమునంది ఇంటికి వచ్చింది.

ఆమె ఇంగ్లండులో చదువుకొనే రోజులలో ఆటలలో మొదట! నాట్యంలో మొదట. భారతీయ బాలిక అయినా, ఆమె అనేక ఆంగ్ల ఉన్నత కుటుంబాలవారి ఇళ్ళల్లో వారి కుటుంబాలలోని బాలికలాగే తిరిగేది. ఆమె అంటే అంత స్నేహం ఆ బ్రిటిషు బాలలకు.

తహిమీనాను చూచినవాళ్లందరూ కొంచెం వేడిదేశంలో ఉన్న ఇంగ్లీషుబాలికే అనుకునేవారు.

టెన్నిస్, షటిల్, ఈత పందేలలో మొదటగా వచ్చేది. తహిమీనాను ఒకరిద్దరు పెద్దకుటుంబాల ఆంగ్లబాలురు పెళ్ళి చేసుకుందామని చూశారు కూడా.

ఎందుకనో తహిమీనాకు పెళ్లి అంటే ఎన్నడూ ఇష్టంలేదు. అనేక పార్సీ పెద్దలు ఆ బాలికకు చాలా మంచి సంబంధాలు తెచ్చారు.

ఆ బాలిక స్త్రీగా ఎంత అందగత్తో, మగవీరునిలా అంత అల్లరిపిల్ల. ఎప్పుడూ మగవానిలా వేషం వేసుకుని గుఱ్ఱంస్వారి చేసేది. కారు నడిపేది. ప్రయాణంలో ఎప్పుడూ మగవేషంలోనే ఉండేది

## 3

బాట్లివాలాగారు కోటీశ్వరులు, ఆయన ఎన్నో కంపెనీలు పెట్టించి వాటిని అత్యంత లాభం కొనివచ్చే సంస్థల చేశారు. ఎన్నో పరిశ్రమ సంస్థలకు ఆయన ముఖ్యాధ్యక్షుడు.

ఆయన మొదటినుంచీ గాంధీమహాత్ముని శిష్యులలో ఒకడయ్యాడు. అందుచేతనే ఈ సంవత్సరానికి ముందు సంవత్సరంలో ఆయనకు ప్రభుత్వం పెద్ద బిరుదం ఇద్దామనుకున్నారు. కాని బాట్లీవాలాగారు ఖండితంగా తన కక్కరలేదని కబురుచేశారు.

తండ్రిగారూ కుమార్తెయూ అహమ్మదాబాదుకాంగ్రెసుకుబొంబాయి నుంచి ప్రతినిధులుగా వచ్చారు.

వారూ కాంగ్రెసుఅయిపోగానే ఒకరోజు అబూచూచి మళ్లీవద్దామని బయలుదేరి వెళ్ళారు.

అబూరోడ్డుస్టేషన్‌లో ఒక మంచి కారువచ్చి ఉంది. స్టేషన్‌లో దాదాబాయి మెహర్జీ తన చుట్టమైన బాట్లీవాలా కుటుంబానికి కారు వేసుకొని వచ్చారు. ఆతిథ్యం ఇద్దామని.

స్టేషనులో బాట్లీవాలాతండ్రి కుమార్తెద్దరకు స్వాగతమిచ్చి అబూ పట్నం తీసుకపోయాడు దాదాబాయి.

ఆ మెయిలు బండిలోంచి దిగి వైకుంఠరావు అతని స్నేహితుడూ ఉదయం ఆక్కడే ఇన్ని పూరీలుతిని, పాలుతాగి బస్సుమీద అబూ చేరారు.

అబూనగరం ఆరావళి పర్వతాలలో దత్తాత్రేయ శిఖరానికి ఆయిదు వందల అడుగుల దిగువను ఉన్నది. అబూఎత్తు నాలుగువేల అడుగులకు తక్కువగా ఉంటుంది. అబూనగరానికి రోడ్డు వంకరటింకరగా పైకి ఎక్కుతుంది.

బస్సు వెళ్ళుతూంటే రోడ్డుమీద ఒక పెద్దపులి పడుకుని ఉంది. బస్సు ఆపి విద్యుచ్ఛక్తి కొమ్ము, మామూలు బూరా అన్నీ హంగామాచేస్తే ఒక్క-

గంతు వేసి దిగువ లోయలోకి పులి మాయమైంది.

అందరి ప్రయాణీకుల ప్రాణాలు లేచిపోయినట్టున్నాయి.

వైకుంఠ:—ఓరే విశ్వం! ఇప్పటికి చూశావు రా ఖరిమీద పెద్దపులిని.

విశ్వం:—నేనూ పెద్దపులులను సర్కసులలోనూ, జంతుప్రదర్శన శాలలో నేగా చూసింది!

రామం:—ఓహో ఏమిగొప్పగా ఉందిరా! ఏమిదర్జారా! మనకేసి నవ్వుతో చూసినట్లుగా అయిందిరా!

వైకుంఠ:—దిగివెళ్ళి దాన్ని పట్టి దాంతో ఆడుకుందామనిపించింది.

కృష్ణమూర్తి:—నువ్వు దుష్యంతుడు కొడుకువా? లేక కాశీమజిలీకథలోని సింహాన్నేమైనా చేవనుకున్నావా?

అబులో ఒక సత్రంలో మకాంపెట్టి మన స్నేహితులు దిలావరా గుళ్ళు చూశారు. అచలేశ్వరదేవాలయం చూశారు, దత్తాత్రేయ శిఖరం ఎక్కారు.

మూడు రోజులైన తర్వాత అబునగరానికి రెండు మైళ్ల దూరంలో ఒక లోయలో వశిష్ఠాశ్రమం చూడడానికి వెళ్ళారు.

౪

వశిష్ఠాశ్రమం ఎంతో అందంగా ఉంది. ఎన్నో ఫలవృక్షాలున్నాయి ఒక సెలయేరు ప్రవహిస్తూ ఉంది.

ఆ ప్రకృతి దృశ్యమూ, అలాంటి ప్రదేశాలలో ఋషులు ఆశ్రమాలు ఏర్పాటు చేసుకొన్న భావమూ సమన్వయం చేసుకుంటూ వైకుంఠరావూ స్నేహితులూ తిరిగి అబూనగరం వస్తూ ఉన్నారు.

చలి హిమాలయాలలోని చలిలా గజ గజ వణికిస్తూ ఉంది.

ఐదుగురు స్నేహితులూ మాట్లాడుకుంటూ వస్తూన్నారు. స్నేహితుల జట్టుకు ముందుగా, ఒక వృద్ధుడు, ఒక బాలుడు అంగ్లదుస్తులు ధరించి

నడుస్తున్నారు. వృద్ధుని తలపై పార్సీ టోపీ ఉంది. సాయంకాలపు బాలుర ఆ బాలుడు హేటు ధరించి ఉన్నాడు.

ఇంట్లో వెనకవచ్చే వైకుంఠరావు జట్టుకు 'ఓహో హో' అన్న ఒక కేక వినబడింది. ఆ కేకలో ఏదో వర్ణించలేని భయం గర్భితమై తోచి, మనవాళ్ళందరు ముందరకు పరిగెత్తారు. ఆ దగ్గరగా ఉన్న స్థలం దగ్గిరకు వెళ్ళగానే మనవాళ్ళ ప్రాణాలు నిలువునా తేలిపోయాయి. ఎదురుగుండా పడుకుని వీరి అందరివైపు ఒక మహా వేదాంతిలా చూస్తోంది ఒక పెద్దపులి!

మనవాళ్ళందరూ బిఱ్ఱబిగుసుకుపోయారు! ఆ కొత్తపురుషులూ బిఱ్ఱబిగుసుకుపోయి ఉన్నారు.

ఇంట్లో ఉరుములా ఒక పెద్ద బొబ్బపెట్టి తన చేతిలో విలాసంగా తిప్పుకుంటూ ఉన్న ఒక అడవిదుడ్డుకఱ్ఱను పైకెత్తి వీళ్ళందరికీ ముందుకు ఉరికాడు వైకుంఠరావు!

ఆ కేకతో పెద్దపులికి ఏమి కంగారు పుట్టిందో ఓ చెంగున గంతు వేసి ఆ దారిపక్క దుబ్బుల్లోకి ఉరికి నిముషంలో మాయమయింది.

పెద్ద కేకలు వేస్తుంటూ ప్రాణాలు బిగపట్టుకొని వారందరూ అబూనగరం చేరారు.

బాట్లీవాలాగారు వారందరికీ ముఖ్యముగా వైకుంఠరావుకీ కృతజ్ఞత తెల్పి తమ బసచేరుకున్నారు.

## 5

అబూనగరం చుట్టుపక్కలూ అంతా చూచి సాగనున్న ఒక స్నేహితుణ్ణి బస్సు మీద పంపి, మిగతా నలుగురూ నడుస్తూ పాటలు పాడుకుంటూ, అయిదవ రోజు సాయంకాలం వైకుంఠరావూ స్నేహితులు ఆజూ స్టేషనుకు పోతున్నారు.

కొండదిగి కొంత దూరం పోయేటప్పటికి, ఆ రోడ్డు మీద ఒక కారూ చుట్టూ ఒక భిల్లజట్టూ కనపడింది. వీళ్ళు నలుగురూ దగ్గిరకు వెళ్ళేసరికి

కొంత మంది భిల్లులు వచ్చి వీళ్ళని చుట్టుముట్టారు. వైకుంఠరావు సహా ఐదుగురు భిల్లులను బంతుల్లా చుట్టి అవతలకు గిరాటు వేశారు!

"ఓకే వీళ్ళు గాంధీ దేముడు జట్టు వాళ్ళరా" అని కేకలు పెట్టి కనుమూసి కను తెరిచేటంతలో మాయమై పోయారు భిల్లులు.

అప్పుడా కారులోంచి దిగింది బాట్లీవాలాగారు, ఏమిటీ విచిత్ర సంఘటనలు అని వారూ అనుకున్నారు. వీళ్ళూ అనుకున్నారు!

తెహిమీనా పార్శీ బాలిక, ఆ బాలిక హృదయంలో వైకుంఠరావు పెద్దపులిని అల్లరి పెట్టినప్పటినుంచి, ఏమి చిత్రమో మకాం పెట్టి కూచున్నాడు. పార్శీ బాలికలు పార్శీయేతరులతో సాధారణ స్నేహం కన్న ఎక్కువ దూరం పోరాదు; అయినా ఆ కొత్త బాలుడు, చీకటిలో కూడా గంభీర వ్యక్తిత్వంతో, అస్పష్టమూర్తిత్వంతో పెద్దపులిని తరిమివేస్తూ ఎన్నిసార్లో ప్రత్యక్షం అవుతూ ఉన్నాడు.

బాట్లీవాలా మన స్నేహితులకు వందనాలర్పిస్తూ నవ్వుతూ "మీకూ మాకూ ఈ చిత్ర సంబంధం ఏమిటో?" అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నానండీ" అని వైకుంఠరావు సమాధానమిచ్చాడు. అందరూ కలిసి భిల్లులు రోడ్డు అడ్డంగా వేసిన రాళ్ళూరప్పలూ ఎత్తిపారవేసి మోటారు కారు సరిగా పోవడానికి దారి చేశారు. కారు వెళ్ళి పోయింది. స్నేహితులు స్టేషనుకు పోయి అహమ్మదాబాదుకు రెండవ తరగతి టిక్కెట్లు కొన్నారో లేదో మెయిలు బండి వచ్చింది.

## 6

వెంటనే మన స్నేహితులైదుగురూ ఇటు తిరిగారు అటు తిరిగారు ఏ సెకండు క్లాసులోనూ ఖాళీ లేదు.

వైకుంఠరావుకు కోపం వచ్చింది. రైలు కదలమని చెప్పినట్లుగా ఈల వేసే గార్డును పట్టుకొని ఒక్కసారి వెనక్కు తిప్పి "గార్డుజీ నమస్కారం! క్షమించండి! సెకండు తరగతిలో స్థలం అణుమాత్రం లేదు, అహమ్మదా

బాదుడు ప్రయాణం. మొదటి తరగతిలో ఎక్కుతాం! తరవాత స్టేషనులో చార్జి ఇస్తాం, సేఠ్!" అని పరుగెత్తి ఒక మొదటి తరగతిలో ఇద్దరే ఉన్న ఆరు సీట్ల దానిలో ఎక్కబోయారు.

పెట్టె గుమ్మంలో తహిమీనా బాట్లీవాలా పురుష వేషంలో నుంచుని ఉంది.

వైకుంఠరావు అతని స్నేహితులు గబగబ ఎక్కబోయారు. "తహిమీనా ఎక్కడానికి వీలులేదు" అన్నది. "ఓయి కుర్రాడా రైలు కదులుతున్నది. వాదించడానికి వ్యవధి లేదు" అని లోపలికి ఆ బాలుణ్ణి నెమ్మదిగా నెట్టుకుపోయి, స్నేహితులకు దారి చేసినాడు.

బాట్లీవాలా గారు ఆగ్రహంతో లేచి "ఎవరువా?" అని కేకవేశారు.

వైకుంఠరావు చిరునవ్వు నవ్వుతూనే ఉన్నాడు. ఇంతట్లో తహిమీనా తన తండ్రి చేతికఱ్ఱ తీసికొని వైకుంఠరావు నెత్తిమీద దబదబ బాదడం ప్రారంభించింది, మరుపటి క్షణంలో ఆ కఱ్ఱ ఆమె చేతిలోంచి ఊడదీసి కఱ్ఱ రెండు ముక్కలు చేసి వైకుంఠరావు మూలపడవేశాడు.

ఒక దెబ్బ అతని నుదురుపై తగిలి చర్మం కొంచెం పగిలి, రక్తం బొట బొట కారింది.

„అదేమిటి అమ్మాయీ?" అని పార్సీ భాషతో బాట్లీవాలా అన్నాడు

వైకుంఠుని తహిమీనా తాడన మారంభించగానే, ఆమె తలపై ధరించిన ఇంగ్లీషు టోపీ ఊడిపడిపోయినది. ఆమె జుట్టుముడి వీడి నూనెవేసిన ఆ బాల కేశపాశం పైబడి విస్తరించింది. ఆ బాలిక సిగ్గుపడుతూ నిలుచుంది. వైకుంఠుడామె ఇంత వరకు బాలుడే అనుకొన్నాడు.

అందమైన బాలుడు, అత్యంత సుందరి అయిన బాలిక అయింది.

ఆమెను తేరిపార చూచినాడు. ఆమె అతన్ని తేరిపారచూచింది

„నీవా!" అని అతడన్నాడు! „నీవా!" అని ఆమె అన్నది.

సర్వకాలం నా చూపులలో ! నా హృదయంలో నా సర్వస్వంలో! ఎల్లాగ నిన్ను వదిలి ఉండటం !"

"ఓయి శాస్త్రిగారూ ! నేనూ నిన్ను వదిలి ఉండగలనా ? ఏమో నేను అసుర బాలికనై, నువ్వు ఆర్య బాలుడవేమో ! గులాబకావలీ కన్య కథ వినలేదా ?"

ఒక్క నిముషం వారొకరి కొకరు విడిచి ఉండలేక పోయారు.

దాదాబాయి గారికి గొంతుకలో వెలక్కాయ పడినట్లయింది. పార్శీ కన్యక పార్శీ తర్ణిణి ఎల్లా వివాహం చేసుకోకలదు?

తహిమీనా ప్రేమ మతాలుదాటింది, దేశాలు దాటింది దేశాభిమానం జ్ఞాబకం కట్టుంది. దేశ, ప్రపంచసేవ చేయడానికి ఎంతముఖ్యమో ప్రేమ బలం అంతేముఖ్యం అని ఆమె అనుకుంది ఒక జాతిని చెక్కుచెదరకుండా కాపాడుకోడం, పురాతన వస్తు సంరక్షణభావం కావచ్చును. అయ్యాదియం భావం అన్ని విషయాలలోనూ వర్తించను శ్రీ జిన్నా గారి వివాహం జాతినిమించి వడిచింది. అని ఆమె దృఢనిశ్చయానికి వచ్చింది.

ప్రేమ ఒక్కటే సర్వ మతాలను, సర్వ దేశాలనుమించి పైకి ప్రవహిస్తుంది ఆ ప్రవాహం కొండలను గోదావరికోసినట్లు ప్రవహిస్తుంది. ఒక నీగ్రో పురుషుణ్ణి తెల్లజాతి స్త్రీ ప్రేమించి వడిస్తే అమెరికా తత్వం అడ్డం వస్తుందా?

ఏ యుగాలనాటిదో ఈ ప్రేమ ఈ దివ్యసమాగము యమునాగంగా సంగమమే అవుతుంది.

ఎందుకు పార్శీలు ముస్లిం మతంలో కలవలేరు. ఎందుకు అసురకన్యలు ఆర్యులీన్ని ఉద్వాహం కాలేరు?

ఈలా తంత్రితో గంభీరంగా వాదించింది తహిమీనా?

## 8

వైకుంఠరావుగారి అనుకూలమేలేదు పార్టీ పత్రికలలో అల్లరి అతను గమనించలేదు. కొన్ని బెదిరింపు ఉత్తరాలకు అతను లెక్కచేయలేదు.

అతను మహాత్మునికి రాసి అనుమతి తెప్పించుకున్నాడు.

పార్టీ పంఘనాయకులు పనికిరాదన్నారు. అనేక విధాల దాదాబాయి బాట్లీవాలా గారిని ఒత్తిడిచేశారు.

వేదాలలో, జెండ్ అవెస్టాలో గాథలుగా, సూక్తులుగా పాడబడిన పవిత్ర మానవప్రేమ శక్తిని మహాబలం ఎవ్వరాపగలరు ?

తహమీనా తండ్రి ఇంటినుండి వచ్చి సమ్మతి వెళ్ళిపోయింది. వైకుంఠరావు సమ్మతి చేశాడు.

సమ్మతి ఆశ్రమంలో తహమీనా వైకుంఠుల వివాహం అతివైభవంగా జరిగింది.

## 9

ఆ దంపతుల ప్రేమ పవిత్ర సత్యాగ్రహవిజయం.

“ఓ దేవీ! తహమీనా! ఏనాటిది మన యీ ప్రేమ?”

“ఆర్యవీరుడవు కంఠం వొగ్గించుకున్నావు!”

“నీవు ఆర్యబాలికవు కావా! ఆర్యత్వం మహాత్మునిధర్మం అర్థం చేసుకోడంలో ఉంది కాదూ! నువ్వు నాకోసం మహోత్తమ సత్యాగ్రహం చేశావు ప్రాణప్రియా!”

తహమీనా! వైకుంఠుని హృదయంమీదవాలి, అతని తలవంచి మధుర పరిమళంగా అతని పెదవులు తనివితీర ముద్దుకొంది. వైకుంఠుడు స్వర్గానికి మొక్కుకొన్నాడు; ఈ దివ్యభామిని తనకు ప్రత్యక్షం చేసినందుకు.

వారిద్దరూ దేశసేవా మహాయుద్ధంలో ఒకరొకరి ప్రక్కగా, ఒకరి నడుంచుట్టూ ఒకరుగా భావిభారతదేశంలోనికి అడుగిడుతూ నడుస్తున్నారు!

# తిరుపతికొండ మెట్టు

## ౧

శ్రీ తిరుమల మహా పుణ్య క్షేత్రంలో గాలిగోపురానికిపోయే మొదటి మెట్ల వరసలో సగం దాటినపైన, ఏకాకి కుంటి బిచ్చగాడు, పున్నాడు నివాసం.

ఏ బిచ్చగాళ్ళ ఋషి కులానికి చెందకుండా పున్నాడు ఆశ్రమం ఏర్పరచుకున్నాడు. రెండు కాళ్ళూ మొండే! కాని వాడికున్న బలం విపరీతం. వాడు చేసే దొమ్మర విద్యల సాహసం, నైపుణ్యం ఏ ఇసాకోగ్రాందు రషియను సర్కసు జట్టులో ఉండే పరమసాహసికీన్నీ లేదు.

చేతులతో మెట్లెక్కుతాడు, కోతిలా కొమ్మనుంచి, కొమ్మకు ఎగిరి దూకుపోతాడు కోతిలాడుతూ చక్రంలా గిరగిర తిరుగుతాడు. దేహమంతా వాలఖిల్యమునిలా పైకెత్తి కాళ్ళమీద తలకిందులా నిలబడి నడుస్తాడు. మెట్టుమీదనుంచి పై మెట్టుకు బంతిలా ఎగురుతాడు. ఒంటిచేతిమీద నిలుస్తూ, చేతుల్లోంచి దూరుస్తాడు. ఆతని విచిత్రపు ఆసనాలూ ముగ్గలూ మండూకయోగివిరూపాక్షానందులుగాని, జపానుసర్కసువీరుడు వనుకాకోగారి విన్యాసం చేసే ఆసనాలూ ముగ్గలూ వేయి కొవ్వువత్తుల విద్యుత్ దీపం ముందు ఆముదం దీపంలా వెలవెలపోవలసిందే!

యాత్రికుల దండాలు మేఘాలులా పున్నెడుముందర ఆగి, అతని అద్భుతమైన ముగ్గులు. వసులు మాసి, ఆశ్చర్యంతో దమ్మిడీలు, కానులు, అణాలు వర్షం కురిపిస్తే, గతి తోచని అయ్యోపరికి, ఆయువూ, ఆరు రూపాయల బిల్లగ చెరువులు కట్టవలసినదే. ఏ బ్రహ్మోత్సవమో అయితే, పది, పదిహేనురూపాయలు వరవలు కట్టాయి.

తిరుపతికొండల ఎక్కుడు దిగుడుల ఏడుమైళ్లలో ఉన్న నాలుగువందల ఏభయియారు బిచ్చగాళ్ళలో, పున్నెడుకు వచ్చే రాబడి ఇంక ఎవరికీ లేదు.

వికలాంగులు ఉన్నారు, ముక్కు నోరు అంతా ఏకరంధ్రమైనవాళ్ళున్నారు. కుష్ఠురోగులు, మాంత్రికులు, సన్యాసులు, ముళ్ళమీద పాంసు తులిశయ్యమీదలా పడుకొనే యోగీశ్వరులు, గుడ్డివాళ్ళు, కోకిలకంఠముతో పాడే గాయకులు, ఆడవాళ్ళు, మగవాళ్ళు బిడ్డలు, భయం కలుగజేసేవి, నట్టి మొద్దువి, కళాసౌందర్యం వెల్లివిరిసేవి విగ్రహాలను ముందుంచుకొని పూజారి పనిచేసే భక్తులు—ఎన్నిరకాలున్నారో తిరుమలేశ్వరుని కొలువుచేసే అయ్యంగార్లు, ఆచార్యులు, ఆళ్వార్లు, రెడ్లు, మొదలియార్లు, సెట్లు పిళ్ళలతోపాటు, కోతులతోపాటు ఈ బిచ్చకుల బృందాలు!

౨

ఆ విచిత్ర పరివారంలో ఉన్న బిచ్చగాళ్ళందరూ పున్నెణ్ణి చూసి, అసహ్యించుకునేవారు! పున్నెడు మట్టివాళ్ళందరికీ విరోధి అయిపోయినాడు. అతడి సంపాదన వాళ్ళ కడుపుల్లో మంటలు చెలరేగజేసింది. వారికి ఉడుకుబోతుతనం కాశ్మీరదేశాన్ని సహారా ఎడారి చేయగలశక్తితో విజృంభించింది. వితరణ పరివాహాలు పున్నెడుదగ్గర ఆనకట్ట కట్టబడి; అక్కడ మహాసరస్సై, అక్కడ ఏడు కొండలూ నిర్ఝర వాహినులుగా ప్రవహిస్తున్నవి.

పున్నెణ్ణి త్వరగా కొండమీద నుంచి జపానువారు మంచూరియా ఆక్రమించుకొని చీనా రాజ్యాన్ని తరిమినట్లు కొట్టివేయాలని బిచ్చగాళ్ల

సంఘంలో ఉద్యమం బయలుదేరింది. బిచ్చగాళ్ళలో ఏ కబురైనా తీగలేని వార్తయి శేషాచలం అంతా నిమిషంలో వ్యాపిస్తుంది మోకాళ్ళ పర్వతం, మొక్కుల పర్వతం, సన్నిధి ద్వారం అన్నీ ఆ వార్త ఆక్రమిస్తుంది. పున్నణ్ణి శ్రీ వెంకటేశ్వర సాన్నిహిత్య భక్త బృందంలోంచి రెండువేల మైళ్ళన్నా విసిరివేసేటందుకు ఒక నాయకుడు ఏకాదశినాడు బిచ్చకుల ఆ ఆశ్రమాలన్నీ తీర్మానించుకున్నాయి. దీనికి కారణం ఏమిటంటే ఆ ఏకాదశి ఉదయం నుంచి పున్నడికి మధ్యాహ్నానికి ఇరవై అయిదు రూపాయిలు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి! పాపం కాలానికి ఈ నిర్ణయం!

ఈ నిర్ణయం ప్రకారం బిచ్చగాళ్ళకు అన్నము, సాంబారు అమ్మే వాళ్లు పున్నడికి అమ్మడం మానివేశారు సరుకులు ఏడుమైళ్ళదారి పొడుగునా విక్రయించే వాళ్లు విక్రయించడం మానివేశారు.

3

పున్నడు మొదట వేళాకోళమనుకున్నాడు. కింద ఆశ్రమంలో ఉన్న దిగుడుబావిలో నుంచి నీళ్ళు, పై ఆశ్రమాల వాళ్ళకీ, వీధి బిచ్చగాళ్ళకీ అమ్మే నీళ్ళమనిషి ఆ వేళ పున్నణ్ణి తిరస్కరించి "నీళ్ళు, నీళ్ళు" అని పున్నడు గోలపెడుతున్నా, వదుమూ కటిగోరం ఆడించుకుంటూ వెళ్ళిపోయింది. పున్నడికి కళ్ళు వచ్చబడ్డాయి.

ఆ స్థలం వదిలి కిందికిపోయి నీళ్ళు తాగిరావచ్చును. కాని పున్నడున్న స్థలం అత్యంత లాభదాయకమైన స్థలం. యాత్రికులు విశ్రాంతికి ఆగే స్థలం. మెట్లెక్కివస్తూంటే నే పున్నడు కనబడతాడు. ఆస్థలం వదిలితే పున్నడికి రెండు నూర్లు రూపాయలిస్తామన్నారు. కొందరు బిచ్చగాళ్లు: పున్నడు ఆ స్థలానికి నెలకు చెల్లించవలసిన అద్దె, చెల్లించవలసిన అమ్మకానికి ఇచ్చి వున్నాడు నెలలకు వెంకటేశ పెరుమాళ్ళ పున్నమా అని సంపాదించాడు

చెట్టునీడని కూచుని కల ఛాయమీద వాలిపోగా. పున్నడు తన జీవితం అంతా తలపోసుకున్నాడు.

౪

పున్నెడు అనంతపురం జిల్లాలో ఒక గ్రామంలో నివసించె అగ్రి మావర్గమూ ఆస్తివంతుడూ అయిన రెడ్డి భూస్వామి. ఈ రెడ్డి కుటుంబానికి, పక్క ఊళ్లో పెద్ద భూస్వాములైన ఇంకో రెడ్డి కుటుంబానికి సరిహద్దు తగాదా వచ్చి కురుపాండవయుద్ధమై పోయింది.

అప్పుడు పున్నెడి పేరు పుణ్యాంరెడ్డి. పుణ్యాంరెడ్డి తండ్రిన్నీ మాగ్గురు అన్నదమ్ములూ వీరస్వర్గం పొందారు. వారితోపాటు అవతల కక్షవాళ్లూ చాలామంది రంభకోసం పెనుగులాడడానికి స్వర్గానికిగూడా ఈ తగాదా తీసుకువెళ్ళారు. అవతల కుటుంబంలో ఇద్దరూ, ఇటు పుణ్యాం రెడ్డీ మిగిలారు.

పుణ్యాంరెడ్డి రెండుకాళ్ళూ ఆ యుద్ధంలో విరిగిపోయినాయి. జిల్లా వైద్యాలయంలో రెండుకాళ్ళూ ఛేదించి మొండికాళ్ళని చేశారు. కుటుంబం యావత్తూ నశించింది. వ్యాజ్యాలలో ఆస్తి ఇదివరకే పోయింది. అన్నదాలయాలు చందాలు పట్టుకొని కాశీయాత్రా ప్రయాణాలు చేసి రెండేళ్ళపాటు కొంటా చ . సోమవారం క్షేత్రపైన రెండవ శేషాచలపతిలా అవతరించాడు పుణ్యాంరెడ్డి. ఇంక రెండేళ్ళలో పున్నెడయ్యాడు రెడ్డి.

అవతల రెడ్డికుటుంబం ఏమవుతుందో అన్న చింత? భగవంతుడు లేడా అన్న వేదాంతం, బ్రతుకుమీద ఆశ అతన్ని తిరుపతికొండ మెట్లలో అవతరింపచేశాయి.

౫

పూర్వచరిత్రలన్నీ మాయమై పున్నెడికి కళ్ళ రెండుచుక్కలు రాలినవి. అతని గొంతుక ఎండింది. ఆకలి కొండచిలువలా చుట్టుకుపోయింది, ఏమూకలు పిప్పిచేస్తోంది.

కొండమీద దుకాణాలకు సరుకు అందుబాటుచేసే వర్తకులు వచ్చినప్పుడు పున్నెడు కొంత డబ్బు వారికి యిచ్చి సాయంకాలానికి వంట

సామాగ్రి తెప్పించుకొన్నాడు. డోలీలవాళ్ళను రెండవసారి చేతిలో వేసి కుండెడునీళ్లు తెప్పించుకున్నాడు! - ఆ సరుకుతో, ఆ నీటితో మూడురోజులు గడిపినాడు పున్నైడు.

నాలుగోరోజు తెల్లవారగట్ల మూడింటికిలేచి మాష్టికి తయ్యారైనాడు. తెల్లవారేవరకు ఒకరూపాయిన్నర మూడు దమ్మిడీలు పోగైనాయి. ఇంతలో మామూలుగా కొండమీద దుకాణాలకు సరఫరాదారుడు కందసామి వంటసామాగ్రి తెచ్చి ఇచ్చే సమయమైందని కొండపైకీ దిగువకూ చూసి, ఆ దక్కనే నాలుగు బారల దూరంలో తాను నిద్రపోయే పొదకడకుపోయి, ఒక పెద్దరాయితీసి చూసినాడు.

అతని కళ్ళు తిరిగి "అమ్మబాబ్యో!" అని వెనక్కి వాలిపోయినాడు. ఆ రాతి కింద పున్నైడు దాచుకున్న అయిదువందల డెబ్బదిఅయిదు రూపాయల మూటా మాయమై పోయింది. పున్నైడు ప్రాణం నిలువునా కూలబడి పోయింది. రాతి పక్కనే పున్నైడూ కూలబడిపోయాడు!

కొంతసేపటి అతని మొగం జేవురించింది. ఈ పని చేసింది తనకు వసువుల్ చేసే కుప్పుసామి గాడే అని అతడనుమానం పడ్డాడు కందసామివాళ్ల జట్టులో వాడు కాడు గనుక తనకు సరుకులిచ్చాడు ఈ కుప్పుసామి రాక్షసుడు పెంకటేశ్వరుని ఆస్తే దొంగతనం చెయ్యగల పిశాచి!

పట్టురివలు తిరిగి కండలుకట్టి, హనుమంతుని హస్తాలవంటి బలమైన అతని చేతులు భయంకరంగా వంకరలు తిరిగినవి ఆ సమయంలో అతని చేతుల కందినప్రాణి కబంధుని వాతబడినట్లే.

౬

ఆ రోజు దొరికిన డబ్బునిచ్చి వంటసామగ్రి కొనుక్కున్నాడు పున్నైడు, ధనంతో పాటు అతని ఉత్సాహమూ శక్తీ పోవడానికి కారణం అలివేలు చర్యే!

గొప్ప దొరకుతుంది. ఇంతవరకు పున్నణ్ణే అదృష్టదేవత ఆవహించింది. ఇంటినుంచి కొండ మెట్లదారి ఏడు మైళ్ళు క్రిందికీ పైకీ ఆమె తిరుగుతూ ఉంటుంది మళ్ళీ ఎన్నాళ్ళకో మంచి దినాలు వచ్చాయిరా అనుకున్నారు.

నీరసించిపోయిన పున్నడికి ఆరవదినం రాత్రి స్పృహవచ్చింది. కొండమీద నుంచి పక్కనున్న లోయలోనికి ఉరికి వెంకటేశ పాద సన్నిధి చేరుదామనుకున్నాడు చేతులతో పాకి నూరడుగుల దూరంలో ఉన్న ఎత్తుబండలమీదకి పోయినాడు. గోవిందా! వెంకటరమణా, ఏడు కొండలవాడా! అని ఉరకపోయినాడు. ఇంతలో చల్లని చేతులు ఆతని నడుం పట్టి వెనక్కు లాగివేసినాయి!

౮

కళ్ళు మూసుకున్న పున్నడు శ్రీ వెంకటేశ్వరుడు ప్రత్యక్షమైనా డనుకున్నాడు. ఆతని దేహం పులకరించింది. చల్లని గాలులు ప్రసరించి నట్లయింది వెన్నెలలు పిండి ఆరగా కాచినట్లయింది.

ఆతడు కళ్ళు తెరచేసరికి ఎట్టఎదుట చెట్టుదక్కాల బిచ్చగాళ్ళ ఆకలి మాలకు నీళ్ళుపోసే పిల్ల ఆలివేలు కనబడింది. ఆమె తీరైన మోమంతా వెన్నెల్లో ప్రవాహాలై ప్రవహించే కంటినీరు మెరుస్తూ కనిపించింది.

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ, "పున్నడు, నేను బహుపాపిని, నిండా ద్రోహంచేసినా అనుభావాల క్రింద రోగంవచ్చి, దుడ్డులేక పబ్బారిపడి నప్పుడు నాకు పత్తు రూపాయలంపిన నీ చల్లని గుండెకు నేను ద్రోహం చేసినా! మక్కాల పర్యంతం ముసలిదానికి నువ్వు చేసిన సాకిరి దేముడే సేయగలు! నీ బతుకునిండా దేముడే వున్నాడే; వీళ్లు పిలానులు, నేను రక్కాసి! వాళ్ల మాటలకు లోబడి, ఈలా పాపి అయిపోతినిదా! ఓయ్! ఓయ్! నాకు నరకందా రాసినాదే!"

అని పొంకమయిన తన వక్షోజాలు ఉబికి పోగా, అతిదీనంగా పొర్లి పొర్లివచ్చే ఏడుపును ఆపకుండా ఏడ్చింది.

౯

పున్నడు నిర్ఘాంతపోయినాడు. అలివేలును, నీరసంలో కూడా బలం తగ్గని చేతులతో దగ్గరకు లాక్కున్నాడు.

"పిల్లా, నాకు కలిగిన ఈ సెబ్బరకు నేను దుఃఖం పొందనే లేదు. ఇంతకుమించి కష్టాలు తీరవని ఈ ప్రాణికి! కాని అతిమెత్తని నీమనస్సుకు, ఎంతకాయితనం వచ్చిందని విచారం పొందినాను. ఎప్పుడూ వెన్నెల్లు కురిసే నీ చూపుల్లో కారుమబ్బులు కనబడినాయి కదా! ఇక ప్రపంచకంలో మంచీ, పున్నెం లేదనే తోచినదే! ఎల ఈ ప్రాణి బ్రతికేది?"

"సామీ! చెమించు నాను కాకినిదా! నీ సొమ్ము ఏడ నీవు దాచేది నాకుదా తెలును కే, అది, కుప్పుసామికి నా నాను సెప్పితినే! అది నాడు నా తీసిందూ!"

పున్నడు పక్కున నవ్వాడు. అతని హృదయంలోనూ వెన్నెల కాసింది.

"హాయోనే! ఈ ప్రాణికి చేతులిచ్చిన యెంకన్న పున్నెమా! పది అయినూర్లు సంపాదించనా? నువ్వు నాదగ్గరే ఉండు! అంతే! నా సంసారం నువ్వు!"

పున్నడు ఆమెను తన చేతుల్లోకి తీసుకొని తలా, కళ్ళూ, ముక్కూ చెవులూ, పెదవులూ ముద్దుపెట్టుకొన్నాడు.

అలివేలు తాను తెచ్చిన మంచినీళ్లూ కూజా పున్నడికి నెమ్మదిగా తాగిపించింది.

మబ్బులు నవ్వాయి! వెన్నెలలకంటె మరీ చల్లని గాఢమయిన అడవి పూవుల పరిమళాలైన కాంతులు వాళ్లపై అక్షతలుగా చల్లాడు.

శ్రీ వెంకటపతి తన ఎదుట జరిగిన వివాహాలకన్న తానే స్వయంగా జరిపిన యీ పెళ్ళి ఉత్తమమైనదనుకున్నాడా!

# టాంకు దళము

౧

భారతీయ సైన్యాలకు ముందుగానే వెళ్ళుతున్నాయి, వారిపొట్టి టాంకు దళాలు. ఈ టాంకులను మరుగుజ్జు టాంకులు అంటారు కూడాను.

ఆ టాంకుల గర్భంలో నిండి ఉన్నవారూ భారతీయ వీరులే!

ఆ ఇసుక మహాసముద్రంలో ఇసుక గుట్టలు, ఇసుక కెరటాలు, వేడి వేడి గాలి దుమారాలు, ఎండమావులు తప్ప ఏ అందమూ ముందు టాంకును నడుపుకొని పోతూ వున్న రావుకు కనబడుటలేదు.

టాంకు కన్నులలోంచే అంతా చూస్తూ, టాంకును నడుపుకుపోయే యంత్రాలను సవరిస్తూ, చుక్కాని చక్రాన్ని తిప్పుకుంటూ ముందుకు తీక్షణంగా సాగిపోతున్నాడు.

గంటన్నరకిందటి చిన్న సంఘర్షణలో అతని రక్తము కెరటాలులా పొంగిపోయింది. మహాక్రోధపూరితమాగధవిహిషాన్ని నడిపే యముడులా తన టాంకును ఈ కందరంలోకి ఆ అడ్డతీగలకట్టపైకి దుమికించాడు, ఎగిరించాడు, పరుగెత్తించాడు.

అతని కన్నులు కప్పిన ఎర్రని తెరలు అతని మెదడునిండిన జ్వాలాస్ఫులింగాలు టాంకు నరనరాలికి కమ్ముకుపోయి, ఆ టాంకే ప్రాణపూరితభయంకర పిశాచమయింది.

టాంకులో ఉన్న తనతోటి భారతవీరులు క్షణక్షణ మారణాగ్ని ప్రయోగశతఘ్నికాలనుండి జర్మనులను చెండాడి వేటాడుతున్నారు.

ఆ టాంకుపై టాంకు విధ్వంసకాగ్నిగోళనిపాతము ఇంతైనా తగ లేదు. తగిలితే దూసుకుపోతుంది. వేస్తే చప్పబడి మూల ఒదిగి కూర్చుంటుంది.

౨

రావు యుద్ధంలో టాంకు నాయకుడుగా చేరకముందు సహజ శాంత శీలుడు, మితభాషి, తపశ్శీలి.

యుద్ధంఅంటే చాలా భయపడ్డాడు పాశ్చాత్యులకే వెరిచాడు రహస్యంగా స్నేహితులను యుద్ధంలో చేరవద్దని ప్రబోధించాడు.

ఇంతలో ఒకనాటి 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రికలో జర్మనులు ఒక రష్యను గ్రామంలోఉన్న యావన్మంది స్త్రీ పురుషులను నాశనం చేశారు అని చదివాడు.

ఆతని కళ్ళు మూతబడి, హృదయం వివశత్వం పొంది, ఆతని మెదడు రక్తం నిండింది

స్టాలిన్ : మీ యువత్యకు, మీ బిడ్డకు, మీ భార్యలకు జరిగే విపత్తు ఆలోచించుకోండి, మా దేశం మీద కాబోతుందన్న భవిష్యత్తు ఆలోచించండి!' అని రష్యనుల ప్రబోధించడం చదివాడు.

ఏమిపట్టిందో తల్లికి చెప్పకుండా — సైన్యాధికారోద్యోగానికి దరఖాస్తు పెట్టాడు రాజ ముద్రాంకితోద్యోగము కొన్ని మాసాలలో వచ్చింది.

మహాయుద్ధానికి శిక్షణ ఇచ్చిన వారిలో ముందువాడయ్యాడు. టాంకునడుపుట, టాంకుయుద్ధము చేయుట, శతఘ్నుల నవలీలగా పేల్చుటలో అద్వితీయుడయ్యాడు.

ధీరలలితుడు ధీరోదాత్తుడయ్యాడు.

## ౩

లిబియా ఎడారిలో భారతీయ సైన్యాలు అవిరళ పురోగమన వేగవంతాలై బ్రిటిషు సైన్యాలతో పాటు చొచ్చుకు పోతున్నవి.

రోమెలు సేనాని జర్మను దళాలను అనేక వ్యూహాలలో, అనేక బాధాలలో రక్షించుకొంటూ నిలువ నీడలేక వెనక్కు పరుగెత్తుకు పోతూ పోతూ ఎల్ అఘేలియా ప్రదేశంలో మోహరించాడు.

మూడురోజులక్కడ ప్రచండ యుద్ధం జరిగింది శతఘ్నుల పొగలు ఇసుక పొగలు దిఙ్మండలం అంతా కప్పాయి. ఎక్కడచూసినా కుప్పలుగా ఇనుప ముళ్ళతీగలు అడ్డాలు, టాంకు విధ్వంసక గర్తాలు, అడ్డాల కత్తెర బంధాలు!

రావుటాంకు ఎల్లాదాటిందో ఇవన్నీ, జర్మను వ్యూహ మధ్యానికి వెళ్ళేటప్పటికి ఒక్క జర్మను లేడు! జర్మనులు ఇంకో తిరోగమన ప్రహసనము నాటకమాడినారు.

## ౪

ఎల్ అఘేలీ విజయయాత్ర సాగుతోనే రావుటాంకులో చక్రం మీదకు వాలిపోయాడు.

ఇన్నాళ్ళనుంచీ చెక్కు చెదరని ఆగని పేలుడు నిధానమైన బ్రిటీషుటాంకు దెబ్బతిన్నది. దూరాన్నుంచి ఒక జర్మనుగుండువచ్చి పేలి, రావుటాంకను పార్శ్వంలో తాకి, చొచ్చి రావుకు కంఠంకిందనే తగిలి ఆతన్ని మూర్ఛాగతుణ్ణి చేసింది.

పక్కనున్న సహాయ చోదకుడు రావును నిమ్మదిగా తప్పించి తానా చక్రాన్ని ధరించాడు.

దెబ్బతిన్న రావు చేతులు ఆ మైమరపులో ఏదో తిప్పుతోనే ఉన్నాయి.

తన టాంకునకు రావు 'మహిషమర్దని' అని పేరు పెట్టుకున్నాడు. మహిషమర్దని దగ్గింది రావును తాత్కాలిక వైద్య శిబిరానికి తీసుకు వెళు తుంటే ఆమె కన్నుల నీరు వచ్చినట్లు ఆమె గర్భంనుంచి వచ్చిన ఇతర భారతీయ యోధులకు కనిపించింది.

వైద్య నాయకుడు పరీక్ష చేసి, కంఠంలోనుంచి వెళ్ళినతీక్ష్ణాగ్నిముఖు శకలము ప్రవహించగా ఆవలికి పోయింది, ఒకటి, రెండు చిన్న రక్తనాళాలు తెగినవి, రావు వారం రోజులలో మళ్ళీ యుద్ధానికి సిద్ధం అని అన్నాడు.

౨

రావుకు ఆపరేషన్ జరిగిన వెనుక స్వర్గలోకంలో విహరించే మత్తు తనంలో, వైద్యోపచారికైన ఒక పంజాబిబాలిక అతడు ప్రేమతో 'మహిష మర్దనీ' అని పిలుచుట విన్నది.

ఆమె ఆశ్చర్య మందింది. ఎవరాబాలిక అని ఆమె ప్రశ్నించు కొన్నది.

రావుకు మెలకువ వచ్చింది. 'నీనా' అన్న ఆ బాలిక రావుని మహిష మర్దని పేరు తలపుకు తెస్తూ హాస్యం చేసింది.

"ఎవరయ్యా! ఆ బాలిక నీ ప్రియురాలా?"

"అవును, ఆమె కులాసాగా ఉన్నదో, లేదో? నామిత్రులు లోకమూ చెప్పేరుకారు!"

"ఏమీ ఉత్తరాలు రాలేదయ్యా!"

"ఉత్తరా లక్కరలేదు. మా స్నేహితులకు తెలుస్తుంది. నవ్వులాలో చిస్తావేమి?"

"ఏమీలేదులే? నీపేరు ఇంగ్లండుకు పాకడుతూ చంపాకటలే!"

"అయితే నీ అందమైన ముఖంలో చిన్న అలలులాంటి ఆ ముడుతలు ఎందుకు?"

„మహిషమర్దని అంటే అర్థం ఏమిటి ?”

„మహిషమర్దని అంటే, దున్నపోతులచంపే తల్లి అని”

„నీ ప్రియురాలికి అంత భయంకరంపేరు ఎందుకూ ?”

„అంతగొడవ ఎందుకులే, మీ వూరుపేది?”

„టునీషియా”

“నీ పేరు?”

„నీనా!

„ఎంత అందంగా వుంది నీ పేరుకూడా !”

„నీ ప్రియురాలికన్నా ఎక్కువ అందంగా ఉన్నానా ?”

„నా ప్రియురాలు ఎవరని నీ ఉద్దేశం? అది టాంకు”

„టాంకా?”

„అవును”

ఆ బాలిక పకపక నవ్వింది. ఆమె వదనము ఆనంద కాంతితో ప్రఫుల్లమైంది

‘నేను నిజంగా భయపడ్డాను రావ్’ అని ఆమె అన్నది.

అతనికంతా అవగతమైంది. అతడు నవ్వుకొన్నాడు; ఆ శిబిర మంచముమీద పడుకొనియే ఆమె రెండుచేతులూ పట్టుకొని తనహృదయాని కదుముకొనినాడు.

బయట వైద్యము చేయబడుతున్న మహిషమర్దని నిశ్శబ్ద గర్జనచేసి, సంతోషముతో నవ్వుకొన్నది.

శివబాలరెడ్డి తీరని విచారానికి ఎప్పుడూ ఉపశమన వాక్యాలు చెప్పేది వృద్ధుడైన తమ్మన్న నాయకుడు; సేనానాయకులలో చాలా పేరుపొందాడు. ఆయనతో తన విచారమింకా వెళ్ళబోసుకున్నాడు శివబాలరెడ్డి నాయకుడు.

తమ్మన్న:- అబ్బాయికి యుద్ధమంటే ఏమీ యిష్టంలేదా?

శివ:- మహారాజా! ఈ రహస్యం తమరితో తప్ప ఎవరితోనూ చెప్ప లేదు. మా వాడు — నాకు చెప్పడం సిగ్గుగా ఉంది — మా వాడు పిరికివాడు కూడానండి!

తమ్మన్న:- ఆ! మరిమీకు! ఎలా తెలిసిందిమీకు. మీ ఉద్దేశం ఏమిటి?

శివ:-(ఒక్క నిట్టూర్పు విడుస్తూ) చిన్నతనాన్నుంచీ నేను చూస్తూనే ఉన్నానండి. చప్పుడవుతే ఉలిక్కిపడి కెవ్వున కేకవేస్తాడు! పిల్లిని చూస్తే భయపడేవాడు చిన్నతనంలో; చీకట్లో ఒక్కడూ ఉండ లేకపోయేవాడు; ఒక్కడు పడుకో లేకపోయేవాడు—

తమ్మన్న:- అదేమిటండీ! అంతమాత్రంవల్ల—

శివ:- కత్తి పట్టలేడు; గుఱ్ఱం స్వారిచేస్తూంటే కొత్త పెళ్ళికూతురి నడకలా ఉంటుంది. రక్తం కళ్ళజూస్తే మూర్ఛపోతాడు. నాకుటుంబంలో ఇంత దురదృష్టం ఇదివరకెప్పుడూ లేదండి! మా అత్తవారివైపునా ఈపిరికి తనం లేదండి. ఎక్కడనుంచి దాపురించిందో ఈ దురదృష్టపు పిరికిదేవత!

తమ్మన్న:- కవిత్వం సగం పిరికిమందు పోస్తుంది మీ వాడు మంచి కవిగా?

శివ:- కవిత్వంవల్ల ఈ పిరికితనం రాదనుకొంటాను. తిక్కన్న మహాకవి, మహామంత్రి మహాదండనాయకుడు! పెద్దనామాత్యులు చిన్నప్పట్నుంచీ మావాణ్ణి బుజగిస్తూ చేరతీసారు. ఇంతప్పటినుంచీ కవిత్వం గంటం, పత్రం. రాత్రిళ్ళు నిద్రపోడు ఆ పిచ్చివస్తే, ఊ కూనిరాగాలు తీస్తూ రాస్తూనే ఉంటాడు.

తమ్మన్న:- దీనికి ఉపాయం నేను ఆలోచించి తమకు మనవిచేస్తా.

శివ :_ఈ రహస్యము అతిగోప్యముగా ఉంచి నా కుటుంబమునకు తాము ఉపకారం చేస్తే మిమ్మెప్పుడూ తలపోస్తూనే ఉంటాము!

తిమ్మన్న :_నే నేమి చేసేది, కొన్నాళ్ళు పోయిన వెనుక చెప్తాను లెండి.

పెద్దనామాత్యుని భవనమునందే సదా వసుబాలుని మకాం. ఇంటికి కూడా రావడం మానివేసాడు. ఆంధ్రభాషలో "విద్యాధరచరిత్ర" అను నరవాహనదత్తవిజయమును అసాధారణకవిత్వం ధారాళంగా ప్రవహిస్తూ ఉన్న గ్రంథం రచించడమే కాక, కర్ణాటకభాషలో పదునెనిమిదేండ్ల బాలుడయిన వసుబాలుడు ఒక వ్యాకరణము, రామచరిత్ర అను కృతినీ రచియించి రాయలకు అంకితం చేసాడు. సంస్కృతములో నిధే అన్నారు వసుబాలుణ్ణి. కావ్య వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలన్నీ భాష్యాలతో పెద్దనామాత్యులు తన ప్రియశిష్యుడికి నూరిపోసాడని విజయనగర పండితబృందం అనుకుంటూంటే శివబాలరెడ్డి సేనానాయకులు విని, తనభార్యతో, 'అబ్బాయి కీర్తి ఏలా ఉంటుందో తెలుసుకొని మూర్ఛపొయ్యే రోజులు వచ్చాయి' అని అన్నాడు.

వసుబాలుడికి పారశీకం అరబ్బి మహారాష్ట్ర భాషలు నేర్చుకుందామని తోచింది అదే వెర్రిపట్టింది. తండ్రిని, గురువును వేపుకుతింటే సరే అని ఒప్పుకున్నారు. బీజపురం వెళ్ళడం మహోత్తమం అన్నారు. నవాబుగారికి స్నేహితుడుగా వెళ్ళడం మరీ ఉత్తమంగా! తండ్రిగారి దగ్గరనుంచి కొండపల్లి మండలాధిపతికి ఉత్తరం. అక్కడనుంచి కటకపురి గజపతి మహారాజులుంగారికి ఉత్తరం తీసికొని వెళ్ళాడు. వారి సభలో బాలుడు గొప్ప గౌరవాలు పొందాడు; పండితులతో వాదించాడు; 'సింహంపిల్లరా, సింహం అయితే ఎట్లా ఉంటుందో' అని ఆస్థానకవులు శిల్లసోయేట్టుగా ప్రతాపం చూపించాడు శ్రీమహారాజా మెచ్చుకుని, అతని ఉద్దేశం గ్రహించి, బీజపురం నవాబ్ బహదూరువారికి స్నేహపు ముద్రిక ప్రసాదించగా, అది తీసుకుని వెళ్ళాడు. ఒక ఏడాది నిరాటంకంగా బీజపురం నవాబు మన్ననకు

పాతుర్రిడపుసూ, పండితులచే గౌరవం పొందుతూ, రాజబంధువుల స్నేహం సంపాదించుకుంటూ, ఆ భావాలు మాడున్నా నేర్చుకున్నాడు. పండితుణ్ణి అయ్యావని తల ఊపుకున్నాడు కూడాను!

## ౨

రాజవంశీకుడు మొహమ్మదు ఇబిన్ బిహానల్లా ఉస్మాన్ అమీర్ జంగ్ నిజాముల్ ముల్కు అనే బాలుడూ, వసుబాలుడూ ఒక రోజున హుక్కా పీలుస్తూ కూర్చున్నారు ఆ మహమ్మదీయ బాలకుని యింట్లో.

అమీర్ జంగ్ :_భాయ్, నీకు చదువు పూర్తి అయిందే, యింటికి పోరాదూ ?

వసు :_ఎందుకు ?

అమీర్ జంగ్ :_మా సుల్తాన్ బహదూర్ వారికిన్నీ విజయనగరం కిష్టరాయలకీ యుద్ధంగా! ప్రారంభం అయిందీ, నీ గతి ఎట్లా అవుతుందో! ఆలస్యం ఎందుకూ ?

వసు :_రాయలకీ నవాబ్ బహాదూర్ వారికిన్నీ యుద్ధం లేదుగా! సంధి రాయబారాలే జరుగుతూ ఉండేవిగా!

అమీర్ :_వెర్రివాడా! మా సైన్యం సర్వం సిద్ధం. ఒక చిటికెలో బెల్గాండగర్నుంచి ఉస్మాన్ పూర్ వాశా సైన్యం బారులు తీరుస్తుంది. ఒక రాత్రిలో కృష్ణ దాటుతుంది. రెండవ రోజుకు ఆ విజయనగరం వాళ్ళు నిద్రకళ్ళు నలుపుకుంటూ ఉండగానే ఆ ఊరుమీదబడి నాశనం చేయడం!

వసు :_అబ్బా! విజయనగరం చాలా అందమైనమహాపట్నంఅంటారు. అది నిష్కారణంగా పాడుచెయ్యాలనే ?

అమీ :_అవసరమైతే అంతే. ఇప్పుడు ముఖ్యావసరం కాబట్టి మగ పుట్టుకన్న వాడు కత్తి కట్టాలని సుల్తాన్ బహదూర్ వారి ఆజ్ఞ. సెలవు తీసుకుంటూ, కటకపురినుంచి మహారాజావారి వేగిరావులతో నీ ఉత్తరాలు నాకు

చంపుతూ ఉంటావుకామా! నీ పెళ్ళి అయినప్పుడు నేను వివాహానికి హాజరు"

అని ఆ బాలుడు వసుబాలునికి సలాం పెట్టి చేయి ముద్దు పెట్టుకొని వీడుకోలిచ్చాడు.

వసుబాలుడి గుండెల్లో రాయిబడింది. 'ఈ పాడు యుద్ధాలేమిటి? ఒకళ్ళని ఒకళ్ళు లక్షలకొలది చంపుకోవడమే! అనుకున్నాడు. ఆతని చెవులు హోరుమన్నాయి; కళ్ళు తిరిగిపోతున్నాయి. రక్తమేఘాలు దశదిశలు కమ్మినట్టే కనిపించాయి! యుద్ధం మొదలైతే ఇట్టే లోపుగా, తాను నెమ్మదిగా గజపతులరాజ్యం చేరి, అక్కడనుంచి విజయనగరం చేరాలి! ఎంత విద్వచ్ఛిరోమణి అయితే నేం; కళాప్రపూర్ణులు కలవాడయితే నేం; సరసశృంగార రసనిధి కాసల్లా వసంతో ఎక్కడివి అయితే నేం; శ్రీ శ్రీ రాజులవారు ఈ యుద్ధాల విషయంలో కటిక వారే!' అనుకున్నాడు వసుబాలరెడ్డి ఉన్న రాజ్యం చాలదా? అబ్బా!

కెందుకురాల రథంమీద నవాబు కోటలో మొక మేదినీమహల్ నుంచి తన విడిది మంజిల్‌కు వస్తూ ఉంటే లోకం అంతా ఫిరంగులు మోగిపోతో ఉన్నట్టే అయింది. కత్తుల వాదుళ్ళు కత్తాయుల సంపుళ్ళు. గుర్రాల మొగమాల్లు, మనుష్యుల అడుగుల్లు మహావేగంతో ఎదుట ప్రత్యక్షం అయ్యాయి. ఆతడు వణికిపోయాడు.

జేవురించిన భీభత్సరూపాలతో భయంకర కరాళాలతో పిశాచాలు ఒకటికొకటి పిక్కటిల్లుతూ వికారతాండవం చేస్తూ అనంతంగా కోటాను కోట్లు కనబడ్డాయి—

ఉలికి పడి బండివానితో మాట్లాడితే ధైర్యం అనుకొని "ఏమయ్యా బగ్గీవాలా, శ్రీ పాదుషా వారికి ఎన్ని అరబ్బీ గుర్రాలున్నాయి?" అని ప్రశ్న వేశాడు.

బగ్గీవాలా:—ఉక్కుల్ - సఫేద్ ఘోడా - హజార్ అందం, వేగం - విశ్వాసం - లడాయిమే - ఖయ్యం గియ్యం నై - ఆఖరి ప్రాణం పోవాలా, రాతు కాపాడవాలా, మహారాజ్!

వసు :- యుద్ధానికేమిగాని—

ఖుస్రు :- ఖుదావంద్, యుద్ధం అంటారే, నేన్కు యెళ్ళి యీ మాట్లు, రేపు యిక్కోటల్కి ఎంతమందిక్కి సంపిస్తాక్—

వసు :- సరే, సరేలే!

ఆలోచనతో ఇంటిలోనికి వచ్చినాడు వసుపాలుడు. ఇంటిలో తన జోడీ అంతా కంగారుగా ఉంది— తురక సర్దారులు కొందరు వచ్చి "మీ సామానంతా వెదుకుతూ ఉన్నారు, మహాప్రభూ, వెళ్ళి చూడండి" అన్నారు. రెడ్డి దడదడమనే గుండెతో లోపలికి వెళ్ళి, "ఏమిటీదౌర్జన్యం" అన్నాడు. నలుగురు సిపాయీలు, ఒక దళవాయి రెడ్డిగారి పెట్టెలు ఏడలు అన్నీ కలగాపులగం చేసి, మంచిమంచి జరీకండువాలు, అంగరఖాలు, ధోవతులు అన్నీ చిందరవందరగా పారేసి ఏమిటో వెదుకుతూ ఉన్నారు. రెడ్డిగారు లోపలికి రాగానే ఆ దళవాయి బంకమంచంమీద కూర్చున్నవాడు లేచి సలాము చేసి, "జనాబ్ మీరు పరాయిదేశంవాళ్లు. మీదగ్గర ఏమైనా రాజద్రోహకరమైన గ్రంథం ఉందేమోనని వెదుకుతున్నాము. ఏమీ కనబడలేదు" అన్నాడు.

వసుపాలునకు ఏమన్నా ధైర్యము లేదంటే మటుమాయమైపోయింది. "నువ్వెవరవు? నా సంగతి తెలుసునా! ఇదిగో శ్రీ సుల్తాన్ సాహెబ్ బహదూరువారి ఫర్మానా!" అని దళవాయిచేతి కిచ్చాడు వసుపాలుడు. సిపాయిలందరూ మోకరించారు. దళవాయి వంగి సలాముచేసి ఆ ఆజ్ఞాపత్రం నెత్తిమీద పెట్టుకొని కన్నుల కద్దుకొని ముద్దుపెట్టుకుని "శ్రీ సుల్తాన్ శ్రీ కటకపురనివాస రాజాధిరాజ మహారాజ అనంతనాథ సర్వశత్రువిదారణ శ్రీ గజపతిరాజబహదూరు స్నేహితులు రాజ్యసభికుడైన వసుపాలరెడ్డిగారు మా రాజ్యము విడిచి క్షేమంగా వారిరాజ్యం చేరుకోడానికి చేసే ప్రయాణంలో మా ప్రజలు, సేవకులు, సేనాధికారులు, తాబేదార్లు యావ

స్వంధిస్తి సర్వగౌరవాలతో వారికి సాకరి చేయవలసింది. ఇది పాదుషా ఆజ్ఞ" అందు చివర దవాబ్ ముద్ర వున్నది.

ఈ ఆజ్ఞాపత్రిం చూసేటప్పటికి ఆ దళవాయి కొంచె మెత్తబడ్డగా వణికాడు—అస్తమానం సలాములే—"అన్నీ సర్దండి" అని పారశీకంలో సిపాయీలకు ఆజ్ఞయిచ్చాడు. అదిమొదలు ప్రాంతంలో వసుబాలవర్మను పక్కన నవ్వాడు.

అంతా నిముషంలో సర్దారు. ఆ దళవాయి సలాము చేసి, "నవాబ్ ఖుదావంద్—మీరు స్వేచ్ఛగా మీ దేశంపోండి—తాళికోటమీదుగా అక్కడ మా సైన్యాలు వుండయి. వర్తకులు మిమ్మల్ని చాలగౌరవం చేస్తారు. నేను తాళికోట తహసీల్, తాలుక్దారులకు అంచె పంపుతున్నా. తమకు అవసరాలకు నాలుగు ఒంటెలు, ఒక ఏనుగు, ఇరవై లష్కర్ హుకుం."

వసు:- తాళికోటలో శుభ్రమైన బస వుంటుందా?"

"జీహాఁ పాండేరు బస పెద్దభవనం: అన్నీ సౌకర్యాలు, చాలా మంచిది."

వసు:- సరే: యిక నువ్వుపోయి నావెంటవచ్చే దళం పంపించు జల్దీ!

ఈలోపుగా అన్నీ సర్దివేయడం అయ్యింది. ఆ దళవాయి సైనికులు వెళ్ళిపోయారు

వసుబాలుని గుండె నిమ్మళించింది. ఏమో తాను రాయల మనిషి అని గ్రహించి, ఇన్నాళ్ళనుంచీ వాళ్ళను చేసిన మోసం ఊహించి కొరత వేయిస్తే! చాలా గొప్పగండం తప్పింది. ఇక్కణ్ణుంచి త్వరగా ప్రయాణాలు సాగించి వెడలిపోతే కొంతప్రాణం కుదుటపడుతుంది.

## 3

తాళికోటలో పాండేకరు గృహంలో మకాంజేశాడు, వసుబాలరెడ్డి. స్నానం భోజనం పూర్తిచేసుకుని ఊరు చూడ్డానికి బయలుదేరాడు. అక్కడ కొన్ని గొప్ప దేవాలయాలున్నాయి. మంచి శిల్పముంది.

శిల్పచాతుర్యమూ, భవననిర్మాణ కుశలత చూచి చాలా మెచ్చుకుంటూ బజారులో చిత్రవిచిత్రమైన వస్త్రములు కొన్ని కొనుక్కుంటూ, వసుబాలరెడ్డి కూలివాని నెత్తిమీద సరుకులతో యింటికి వచ్చినాడు. ఈ తెచ్చిన సామాను తనకుండిన తోలుపెట్టెలో, కొంత కావడిపెట్టెలోను సర్దుకుంటున్నాడు. అప్పుడు తనబట్టలమధ్య దివ్యమైన రవిక ఒకటి కనబడ్డది. ఆరవిక పొంకంచూసే టప్పటికి వసుబాలుని హృదయం హాయిమనే రాగాలు పాడింది, ఘుమఘుమ పరిమళించింది ఆ రవిక. జరీపువ్వులు, ఆణిముత్యాల అంచులుకట్టిన ఆ కోలి బట్ట ఊదారవిక ముట్టుకోవడంతోనే వసుబాలుడి ఒళ్ళు జల్లుమంది. ఒక దివ్యసుందరవిగ్రహమైన బాలామణి రవిక విప్పి, మడత పెట్టి తన పెట్టెలో పెట్టినట్టే వుంది.

ఆ ఆనందంలో ఈ రవిక తనపెట్టెలో ఎట్లా వచ్చినది అని ఆలోచన కలిగింది. విద్యానగరం బయలుదేరినప్పటినుండి వుందా? తనపెట్టె లక్షసార్లు సర్దుకున్నాడే; వుంటే కనబడదూ? పైగా తనయింటిలో ఇల్లాంటి రవిక తొడుక్కునే బాలికలు ఎవరున్నారు?

రవిక చేతో పట్టుకునే వున్నాడు, ఇంకా గుడ్డలు తీస్తూ వుంటే మనోహరమైన చీర కనిపించింది మాయా? కలా? పావనం చేసేటంత అందంగా వుంది ఆ చీర. ఉదయారుణకాంతిలా మృదువుగా వుంది, వెన్నెలలా లాలిత్యం తెచ్చింది. చుక్కల మినుకులా లేని లేదనునట్లుగా అతిసన్నదనం, వేయిపూవుల తావులు పారిజాతాలు కరిగించే మడతలు అక్కడక్కడ!

ఈ ఇంద్రజాలం అర్థం కాలేదు. ఆలోచనలేని ఆనందతన్మయత్వ ములో ఒక నిమేషం మునిగిపోయి వనబాలుడు ఇంక „అనగా అనగా ఒక్క రాజకుమార్తె రావాలి—"

అంటూ ఉండగా సభాలున తలుపు తోసుకొని మేఘంలో మెరుపులా ఒక వ్యక్తి సుగంధంతో నిండిపోయిన మలిగాలిలా వచ్చి వనబాలుణ్ణి కౌగిలించుకొని „బాబా! ఎన్నాళ్ళకు కలుసుకున్నాము!" అన్నది.

కృచిస్తాంగాలు అతని దేహాన్ని చుట్టివేయడంతోనే అతనికి కెరటాల్లాంటి పులకలు పుట్టినవి. పులకరించిన ఆ వ్యక్తి అంకలో పోనిచ్చి సదా? కళ్ళు కమిలిపోయాలు చేసి, వనబాలుడి తలవంచి, అతని పై పెదవిమీద ఊపిరాడకుండా ముద్దులవర్షం కురిపించింది. వనబాలుడు తన్మయుడై అతి యత్నంగా, అద్భుతంగా, ఆనందతమంగా వచ్చిన ఆ మహాప్రవాహంలో ప్రాణాల్ని ఎక్కడికో పోనిచ్చి ఏమి తెలియకుండానే ఆ వ్యక్తిని తన వక్షానికి గట్టిగా అదిమివేసుకున్నాడు ఎన్నెన్ని ముద్దులు బదులిచ్చాడు!

ఇంతలో ఆ నూతనవ్యక్తి కౌగిలి సడలించుకుంది. వెనుకకు పోయి అచ్చట ఉండే ఒక పీఠంపై చతికిలబడి, „ఇప్పటికి నా ప్రాణం మరల వచ్చింది" అని మెల్లగా అనుకున్నది.

ఆమె పదహారేళ్ళ ఎలప్రాయాన వెలిగిపోయే బాలిక. చాలా అందముగా ఉంది. మోము మూటగట్టిన ముద్దులే; ముంచి విశాలమయిన కళ్ళు. ముక్కు సమంగా సన్నంగా రాగంలోని "సంగతి"లా ఉంది. ముద్దకరపిరం మొగ్గలే పెదవులు. చిన్ననోరు! దివ్యశిలాసమూర్తి. గాలిచేత చెదరిన నీలి మబ్బులా ఆమె జుట్టుముంగురులు చెదిరిపోయివున్నాయి. కళ్ళల్లో నీరు తిరుగుతున్నది. కాంతులు రెండు ఆ కళ్ళల్లోని వెనక వెనక కనబడినై. పెదవుల చివర సంతోషాన్ని విషాదాన్ని సమైక్యం చేసిన సుడిగుండాలు అతి చిన్నవి తిరుగుతున్నవి.

వసు:— నువ్వు ఎవరవు ?

బాలిక:— మాది రాయచూరు కాపురము.

వసు:— అయితే ?

బాలిక:— నేను ఈ దేశంలోంచి పారిపోవాలి.

వసు;— ఏమిటీ ?

బాలిక:— బీజాపురం నవాబుకు శ్రీ మూరురాయరగండ శ్రీ కృష్ణ రాయసార్వభౌములవారికి యుద్ధం వచ్చింది.

వసు:— ఎందుకు ?

బాలిక:— శ్రీ కృష్ణరాయలయ్యావార్లంగారు రాయచూరు ముట్టడించారు.

వసు:— ముట్టడిస్తే ?

బాలిక:— రాయచూరు నవాబుది. అందుకని యుద్ధం.

వసు;— నాకీ గొడవ అంతా ఎందుకు ?

బాలిక:— మీ చేతిలో నా ప్రాణం వుంది.

వసు:— నీది రాయచూరు కాపురం అయితే యీ యుద్ధ అంటే నీకు భయం ఎందుకు ?

బాలిక;— రాయచూరు పూర్వకాలంనుంచి విజయనగరం వారిది.

వసు:— అది నువ్వు పారిపోవటానికి కారణమెట్లా ?

బాలిక:— రాయచూరులో వుండే వాళ్ళంతా విజయనగర పక్షపాతులు_నేనున్నూ విజయనగరపక్షపాతిని_అందుచేత విజయనగర రాజ్యంలోకి పోవాలి.

వసు — నువ్వు యిక్కడున్నంటే ఏమి భయం ? నువ్వు యిక్కడ వుండడం ఏలా తటస్థించింది ?

బాలిక.— నేను ఈ చుట్టుపక్కల మా చుట్టాల యిళ్ళల్లో వుండడం

తటస్థించింది. రాజమహలు సంగతులన్నీ గ్రహించాను. నేను శ్రీ రాయల వారి వేగువారిలో ఒకర్తెను అంతఃపుర పరిచారికలతో మెలగుతూ అనేక వేషభావాలతో సంచరిస్తూ సంచరిస్తూ రహస్యములు ఎన్నో గ్రహించాను. అన్నీ ఎల్లుండి ఉదయంలోగా అప్పాజీవారికి అందాలె! అట్లా అందాలంటే తమరొక్కరే ఆధారం.

వసు:— మా ప్రభువున్నూ మీ రాయలవారికిన్నీ మనస్పర్థలు చాలావున్నాయి. మాది కటకపురం. నేను నవాబువారికి శత్రుహితుణ్ణి నేను మీకు ఎట్లా సహాయం చేస్తాను. నా దగ్గిర మా ప్రభువు గజపతి మహారాజుల వారి ఆజ్ఞాపత్రమూ శ్రీ నవాబుగారి ఫర్మానాయున్నూ వున్నవి.

శాలిక:— మీరన్నది కొంతనిజమే కాని మీ చరిత్ర నాకు పూర్తిగా తెలుసును. శ్రీ శివబాలరెడ్డివర్యులను అందుకోసమే జ్ఞాపకం తెమ్మన్నాను. నేను నవాబు తరఫున మనిషిని అని మీరేమిన్నీ భయపడవద్దు. మీరీవూరు సంవత్సరంక్రితంవచ్చి పాలకం నేర్చుకున్నారు. మీ గ్రంథాలన్నీ చదివాను.

ఆ ఆఖరుమాటక్కు వసుపాలుడి హృదయం పొంగిపోయింది.

"నేనున్నూ, మా తండ్రి ప్రతాపరాయులవారున్నూ రాజమహలులో రాజులవారి వేగుసైన్యంలో పనిచేసేవారం. అంతఃపురాల్లోని రహస్యాలు గ్రహించడంలో అతిచమత్కారంగా పనిచేస్తానని మా నాయనగారంటూరు. ఆయన గ్రహించిన రహస్యాలు, నేను గ్రహించిన రహస్యాలు నా దగ్గిర వున్నై; ఆయన దారిగా ఆయన, నా దారిగా నేను పారిపోదామని అనుకుంటూవుండగా ఆయన పట్టుబడ్డారు. మా యిద్దరికి తప్ప యింక ఎవరికీ యీ రహస్యాలు తెలియవు. మీ చరిత్ర మొదటనుంచీ మాకు తెలుసును. మా తండ్రిగారు పట్టుబడినతర్వాత నేను మా చుట్టాల యిళ్లల్లో మాయమయ్యాను. నా సంగతి నవాబు వేగు సైన్యాధిపతికి, అతని తాబేదార్లకు చాలామట్టుకు

తెలియవచ్చింది. పూర్తిగా తెలియదు. చిన్నతనాన్నుంచి మగబిడ్డలులేని మా తండ్రి నాకీ తెలుగువిద్య చాలా బాగా నేర్పారు."

వసు:— అయితే నేను నీకు ఎల్లా సహాయము చేయగలను ?

బాలిక:— నా దగ్గిర నవాబు ఫర్మానా వుంది. అందులో వసుబాల రెడ్డిగారు అన్నది సంతకం చివరనున్నది. అక్కడ భార్యతో అని చేరిస్తే సరిపోతుంది.

ఆమె ముఖం సిగ్గుతో కెంపువారింది.

వసు.— నువ్వు అవివాహితవా ?

ఆ బాలిక ఔనని తలవంచుకొని తలవూచి, కన్నులెత్తి అతనిమోము ఒకసారిచూచి మళ్ళీ కనురెప్పవాల్చింది.

వసుబాలునికి ఏమనో ఆనందం వరదలుకట్టిన సెలయేరులా పరవళ్ళెత్తింది

వసు:— నువ్వు చెప్పదలచుకున్న యదార్థములన్నీ గుర్తేనా ?

బాలిక తలఎత్తి చూచి, మరలవాల్చి చిరునవ్వులు పెదవులచివరను తొణకుతూ ఉండగా వేలికి ఉన్న ఉంగరం తీసి అతనివైపు తిరిగి అరచేతిలో ఉంచుకొని అతనివైపు చేయిచాచింది.

అది శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమునిముద్రిక. ఆ ముద్రిక విద్యానగర రాజులలో చాలా కొద్దిమందికే తెలుసును. వసుబాలుడు ఆశ్చర్యంపొందాడు. గడగడలాడి, ఆ ముద్రిక ఆమె హస్తములలోంచితీసి కన్నుల కద్దుకొని, శిరస్సుపై ఉంచుకొన్నాడు. అతనికి ఆ బాలిక అంటే భయమూ, భక్తీ, గౌరవమూ కలిగాయి.

"సరే! సరే! అట్లాగే నీ ఇష్టం వచ్చినట్లే చేయి కాని నేనుమాత్రం ఆ ఫర్మానా దిద్దలేను"

"ఆ పని నాదండీ; ఆ ఫర్మానా నా చేతికివ్వండి"

"కాని నా ఫర్మానాలో ఉన్న సంగతులన్నీ నీ కెట్లా తెలిసినవి?"

„అయ్యా బీజపురంలో మిమ్మల్ని తనిఖీచేయడానికి వచ్చిన ముస్లిం దళవాయి సైనికులు శ్రీ చక్రవర్తి వేగుసైన్యంలో ఉన్నవారే!”

వసుబాలుడు అత్యంతాశ్చర్యంలో మునిగిపోయాడు.

“అయితే నా పెట్టెలో ఉన్న రవికా, చీరానీవా? అవి బీజపురంలోనే ఆ దళవాయి నా పెట్టెలో సర్దిఉన్నాడు కాబోలు?”

„అవి నావే! ఆ దళవాయే మీపెట్టెలో పెట్టాడు. అతనే మీకీయబడిన ఫర్మానా చూశాడు. మీమీదే మా వేగు ఆధారపడి ఉన్నదని మా నాయకులు నిశ్చయించేసి మిమ్మల్ని సహాయం కోరుతున్నారు.” అని అంటూ ఆమె ఫర్మానా తీసికొని, తన కాటుకభరిణ తీసింది, ఆ భరిణెలో రెండు రహస్యమైన మీటలు నొక్కగానే ఒక చిన్న అర తెరుచుకుంది: ఆ అరలో సిరా ఉన్నది. ఆ సిరాతో అతని పేరుతో పక్కనే, ఆమె భార్యతో! అని నాలుగురేఖలతో పారశీకంలో రచించింది.

## ౨

వసుబాలుడి కవిహృదయం యావత్తూ ఆ బాలికలోలయమై గంగాయమునాసంగమమైంది. ఆమె కౌగిలింతవల్ల స్మృతివచ్చినప్పటికల్లా ఒళ్ళు ఝల్లుమంటూ ఉంది. ఈ పదహారేళ్ల బాలిక ఎన్ని కష్టాలకైనా ఓర్చి స్వామికార్యం విజయంతో నిర్వహిస్తూన్నది. ఈ బాలిక తన విషయంలో జరిపిన తంతు ఇతరులంటే కూడా జరపలేదు కదా? అని అనుకున్నాడు. అప్పుడా బాల తానెక్కిన జోడుగుఱ్ఱాల బండిలోనుండి అతన్ని వాలుచూపులతో గమనిస్తూ, వసుబాలరెడ్డిగారూ! నా విషయంలో కొన్ని అపోహాలు మీకు రావచ్చును. నేను నా రహస్య చారిణీచరిత్రలో మా తండ్రిగారిని తక్క ఇంకొక్క పురుషుని తాకలేదు. మీ విషయంలో 'నువ్వు ఈలా, ఈలా చేయి!' అని మా తండ్రిగారు ఆజ్ఞఇచ్చారు. ఆ ఆజ్ఞప్రకారం—”

„అబ్బెబ్బే!” అని వసుపాలుడామె మాటకు అడ్డము వచ్చాడు. అతనికి చిరుచెమటలు పట్టినవి. ఈ బాలిక తన హృదయములోని ఆలోచన ఎట్లా గ్రహించగలిగింది! అంతటి దివ్యసౌందర్యాంగి, ఉత్తమచరిత్ర! ఎప్పుడూ హీనత్వంలో పడిపోయి ఉండదు! అయితే ఈమెను అట్లా సంచరించవలసిందని ఈ బాలికతండ్రి ఎట్లా అనగలిగినారు? కాని తన విషయంలో ఈ రీతిగా విచిత్రంగా సంచరించమని ఎందుకు చెప్పి ఉంటారు ఇందులో ఏదో పరమార్థం ఉందని అతడనుకొన్నాడు.

వెర్రి ఆలోచనలు! వట్టి అయోమయ అన్యభావం! ఏమిటి ఆమె తన్నలా ముద్దుపెట్టుకోవడానికి కారణం? భార్యగా నటించడం అంత ఎక్కువగా?

వారు ప్రయాణం చేస్తూ ఉన్నారు. అతను గుఱ్ఱంమీద అధివసించి ప్రయాణం సాగిస్తున్నాడు.

అతని ఆలోచనలు గ్రహించినట్లు బాలిక „రెడ్డిప్రభూ! నాతో వచ్చిన దాసీలు మీ ఇంట్లో ఉన్న దాసదాసీలు నవాబువేగులవారు. అందుకని నేను చాలా నటించవలసివచ్చింది. అప్పటికిగాని వారి అనుమానం పోలేదు!”

ఆ మాటలు అతని హృదయాన్ని కుదింగచేశాయి. అంతేనా, నటనా? లేకపోతే తనకూ ఆమెకు సంబంధం ఏమిటి? ఆమె మహారాజ కార్యానికి తనతోనూ శంకించడానికి వీలయిన నటన చేస్తే తాను వచ్చె ఆమెను ఎదురుముద్దులు- గట్టిగా- గాఢంగా- కౌగిలించుకొన్నాడు. ఓహో! ఆ క్షణం అత్యంతరహితమైంది. ఆమె పెదవులంత మధురముగా ఉన్నదేమి? ప్రియురాలి పెదవులంత మధురమూగా ఉండునేమి? అబ్బా! ఈ ఆలోచనలేమిటి తనకు? ఈ బాలిక అవసరిస్తే ప్రేమలు లెక్కపెట్టుచు ఈ అమ్మాయి దగ్గిర ఎప్పుడు రహస్యం దాచుకోగలను?

వసుపాలుడెక్కినగుఱ్ఱం ఆమెబండి వెనక్కు పోనిస్తాడు. ఆమెను ఎన్నో విధాల వర్ణించుకుంటాడు. ఇది ప్రేమా? అనుకుంటాడు. ఈమెతండ్రి

ఎవరు? ఈలా ఈమెను ఒంటిగా విడిచి పారిపోయారు కదా? ఏలాగో విధివశాత్తు తానక్కడ ఉండటం సంభవించింది. లేకపోతే ఆమె బ్రతుకేమి గావలె?

ఎట్లాగ తాను ఈ నవాబు సైన్యాలు దాటడం? ఏలాగు ఈ బాలికను తాను సురక్షితంగా శ్రీ నవాబుసైన్యాల పాలబడకుండా కాపాడుట?

ఈ బాలిక ఎంత తెలివైనది! ఎంతచక్కగా మాట్లాడింది. తాను ఎంత తొందరగా వ్యాపారంసర్దుకు వచ్చింది. ఎలాంటికష్టమైన స్థితివచ్చినా ఆ బాలికే అన్నిసర్దుకు పోగలదు!

అదృష్టవశాత్తు అతని ప్రయాణం కూడా రాయచూరు ప్రక్కనుంచే వెళ్ళవలసియున్నది. అక్కడనుంచి ఉళ్ళింది, అక్కడనుంచి పానగల్లు, అక్కడ నుండి దేవరకొండ, పిల్లలమర్రి అటునుండి విజయవాడ అలా బీజపూరు నవాబు ఉద్యోగులు అతని ప్రయాణం ఏర్పాటుచేశారు.

దారిపొడుగునా బీజపుర సైన్యాలే ఎదురవుతున్నవి. వారు మన ప్రయాణీకుల్ని ఆపుచేయడం, మనయాత్రికులు సుల్తాను గారి ఫర్మానా చూపిస్తుండడం, సైనికులు, ఆ ఫర్మానాకు సలాములు చేయడం పోనివ్వడం నాలుగైదు సార్లు జరిగింది. ఎప్పటికప్పుడు వసుదాలుడి ప్రాణాలు అయిపోతున్నా అతని అరచేతిలోకి చేరేవి.

రెండు రోజులైన వెనక వసుదాలుడును, ఆ బాలికయు తమ అనుచరులతో ఉళ్ళింది చేరుకొన్నారు. దారిపొడుగునా ఆ బాల వసుదాలునికి వంటచేయించడం, వడ్డింపించి, తానాతని వెండికంచంలో అతను భోజనం చేసినవెనుక భోజనం చేయడం మొదలైనపనులు చేసేది. అతనికి తాంబూలమందిచ్చేది. వారితో కూడా వచ్చే చిన్న సేవకుల్లో, ఆ అమ్మాయి దాసీలలో పిల్లిమాపులుగల వేగులున్నారని ఆమె అతనితో రాత్రిళ్ళు వాళ్ళిద్దరు ఒంటిగా ఉన్నప్పుడొకసారామె యాతనితో చెప్పింది.

ప్రయాణపు పట్టిమంచములు వారిసామానులో ఉన్నవి.

వారు తమ గదిలో చేరిన కొంతవరకు ఆమె వీణ వాయించేది. అతని పాదాల నొత్తునది. ఆ వెనుక ఆమె తలుపు గడియవేయునది.

గడియవేసి, తలుపునకు తెరకప్పి, తమమంచము దూరముగా లాక్కొని, ఆమె నిర్భయముగ నిద్రపోవునది. అతడు నిద్రలోనున్న ఆ బాలిక అందాలు గమనిస్తూ, ఆమెనుగూర్చి ఒక గంధర్వ బాలికోపాఖ్యానము రచించసాగాడు అతని ఆలోచనలకు మేరలేదు. తన గురువు రచించిన మనుచరిత్రలో ప్రవరాఖ్యునిలా తాను అసిధారావ్రతమాచరించాలా! ఏమిటీ విపరీత దాంపత్యము? తమ ఈ నాటి చరిత్ర సుఖాంతమైనచో, ఆ బాలిక మరల తనకు కనబడునా?

ఎవరీబాలిక ఈమె? ఈమె తండ్రి బీజపూరు సైనికులబారినుండి తప్పించుకొని పారిపోయినట్లు దారిలో ఒక రెడ్డివేషమున ఒక చారుడు యాదాలోవమున వీరికి తారసిల్లినట్లు, వచ్చి ఏదో వారి సంజ్ఞలప్రకారము ఆ బాలికకు తెల్పి తన దారిని తాను పోయినాడు?

ఉళింది సాయంకాలానికి చేరుకొని, దేవాలయ సత్రంలో బస చేశారు వారు. ఊరంతా బీజపూరు సైన్యాలు నిండివున్నాయి. సత్రంలో దిగగానే, ఒక సర్దారు కొంతమంది ఫౌజుతోవచ్చి వసుబాలుణ్ణి నవాబుగా. ఫర్మానా చూపించమని కోరాడు.

వసుబాలుడు లోపల వణికాడు, కొంచెం కోపమువచ్చింది. మాట్లాడకుండా మొఖం చిట్లించుకుంటూ ఫర్మానామతీసి చేతికిచ్చాడు.

ఆ సరదారు వింతతో ఫర్మానాను ఎగాదిగా చూశాడు; కాగడాలు తెమ్మని ఆ వెలుతురిలో పరీక్షించాడు.

సర:- మీ భార్యపేరు?

అమ్మయ్యో, ఇదేమి ప్రశ్న? వసుబాలుని గుండె గుభిల్లుమన్నది. అయినా ఆమె పాత్రాలు కొన్ని చెప్పియున్నది- „సిరియాలదేవి" అని అతడు ప్రతివచనమిచ్చాడు.

ఘూర్ణించి, "నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?" అని చిన్న ప్రశ్న వేశాడు.

"నాకు మొదట ఇష్టంలేదు; కాని మిమ్మల్ని చూచిన కొద్దీ నా హృదయం సంపూర్ణంగా మీపై ఉంచి ఆ ప్రీతిలో నా ఆత్మ నా సర్వస్వము తమలో లీనమై పోయింది"

వసుబాలుడి హృదయం రాగాలు పాడింది.

"అయితే పరపురుషుణ్ణి అనైనా ఎంచక నన్ను తాళికోటలో..."

"మా నాయకుడు కొద్ది వారాల క్రిందట మా నాయనగారికి రహస్యమైన అంచె పంపించాడు. అది చూచి ఆయన గడియల కొద్ది అది ఆలోచిస్తున్నారు. ఒక రోజున ఆయన నన్ను మగవేషం వేసుకోమన్నారు; ఆయనా వేసుకున్నారు. ఇద్దరం బయలుదేరాము బీజపురంలో నవాబుగారి మొహన్‌ఖానాలో మీ దగ్గరకు వచ్చాం. ఒక బుధవారం ఒక యువ తురక నవాబు, ఆ నవకుమారుడూ రాలేదూ!"

"అగాద్దగా మీరా! నిజంగా!" ఆ బాలికను తన హృదయానికి ఇంకా అదుముకున్నాడు.

"మేము బయటికి వెళ్ళిపోయిన తరువాత మా నాయనగారు నన్ను చూసి 'అమ్మాయీ అరవిందా, ఆ అబ్బాయియే నీ భర్త; అది శ్రీ శ్రీ మనచక్రవర్తి ఆజ్ఞకూడా!' అన్నారు"

వసుబాలుడు ఆశ్చర్యంచేత అనిమిషుడయ్యాడు. "ఏమిటి! నీ పేరు అరవిందా? ఎంత మనోహర నామం. అరవిందా! అరవిందా!! ఈ నామమేం, నా బ్రతుకు పరమావధి నాకు ప్రత్యక్షం చేయగలదా?" అని ఆతడు పులకరించిపోయినాడు. అతనికి వేయి ఏనుగుల బలం వచ్చింది.

తెల్లవారి పోతూన్నది: మంచువిడిపోయింది: ప్రకృతి అంత తూర్య రావాలు పాడింది.

వసుబాలుడు అరవిందాదేవి చేయిపట్టుకొని నెమ్మదిగా కృష్ణ దాటడం ప్రారంభించారు. కొంతదూరం పోయేటప్పటికి లోతు అగాధం. వసుబాలుడికి ఈతరాదు మళ్లీ వెనక్కువచ్చారు. ఒడ్డున వున్న పడిపోయిన రెండు చెట్లు కష్టపడి కృష్ణలోకి తోశారు. ఇద్దరూ పట్టుకొని నెమ్మదిగా కాళ్లు కొట్టుకుంటూ నదిలోకి లోతుల్లోకి తేలిపోయారు.

ఆ ప్రవాహానికి నదిలో చాలా దిగువను కొట్టుకువచ్చారు. ఎండ వచ్చింది. దంత ధావనాదులు చేసుకుని రాయచూరు ఎటువుందో అని కృష్ణా నదితీరం వెంబడే నడక సాగించారు. వసుబాలుడు తలకు చుట్టుకున్న పై కండువా తడవలేదు కాబట్టి అది చీర పిండుకొని కట్టుకోమని అరవిందా దేవికి ఇచ్చాడు

ఆమె పుట్టపాక పట్టుచీర పాముకుబుసంలాంటిది. ఆ ఎండలో ఒక అరగంటకి ఆరిపోయింది. ఆరిపోయిన బట్టలు కట్టుకుని ఇద్దరూ దారి సాగి నారు ఆకలి! పొద్దెక్కినకొద్దీ ఆకలి ఎక్కువఅయింది.

అలాగే వెళుతూవుండగా నెమ్మది నెమ్మదిగా ఫిరంగుల చప్పుడు వినవచ్చింది పెద్దగోలమూ హోరు. వీళ్లు నెమ్మదిగా ఒక గుట్ట ఎక్కారు. ఎదుట రెండు సైన్యాలు హోరాహోరి పోరుతున్నాయి. రెండు కోసులు వ్యాపించివున్నవి ఆ సైన్యాలు. బందూకాలు; తోపుఖానాలు చెవుల పుటాలను బద్దలు కొడుతున్నవి. అతిఘోర దృశ్యంగా కించిత్తు భయంతో చూస్తూ నిలుచుండి పోయాడు వసుబాలుడు. అరవింద ఆకలిచేత, బడలిక చేత ఆయాసంచేత వడలిపోయిన పువ్వులా సొలవాలిపోయింది. వసుబాలుడు చూచి, 'అమ్మయ్యో' అని ఆ బాలికను ఎత్తుకొని నెమ్మదిగా ఆ గుట్ట దిగాడు "అవతల సైన్యం రామరాజుసైన్యం అయివుంటుంది. ఒక్కడను ఎలాగైనా జేయకుంటిమా, మా ప్రాణాలు మావి" అనుకుంటూ వసుబాలుడు ఆ వైపుకు ఆ చెట్లచాటునుంచి వెళ్తూ వున్నాడు.

అతని హృదయాన్ని పకిపావలా, హత్తుకుపోయిన ఆ బాలిక అతని మొగంచూసి, "ఈ సమయంలో నేను బ్రతుకుతానని తోచదు. నన్ను వదలి మీరు వెళ్లిపోండి" అని అన్నది_

వసుబాలుడు భయపడి కోపంతో, ,,నేనా నిన్ను వదలడం? పెన్నిధి దొరికిన పేదలా వున్నాను. పాలసముద్రంలో లక్ష్మి విష్ణువుకు దొరికినట్లు నాకు దొరికినావు నా ప్రాణం అంతా నీలోనేవుంది. నువ్వులేని ఈ ఉత్తరక్షణంలో శివబాలరెడ్డి పుత్రుడులేని తండ్రి___!!"

ఆ బాలిక నవ్వుతో అతని నోరు మూసివేసింది.

,,అవతలితి శ్రీ చక్రవర్తి సైన్యం, మనం ఎల్లాగో అక్కడకి పోవలె నాకు ఏమీ ఓపిక లేదు, కాబట్టి మీరు నన్ను దింపండి, కొంతదూరం నడవ గలను అలా నడవలేనప్పుడు మీరు నన్ను.........ముఖ్యంగా ఈ రెండు వస్తువులు మీ దగ్గర వుంచండి: ఇది శ్రీ చక్రవర్తి రహస్యముద్రిక; ఇదిమీరు మాకు ఆనురాబాదు నంపిన బేగిరావు ఉత్తరం" అని నవ్వుతూ యిచ్చింది.

,,ఎందుకూ ఈ ఉత్తరం" అని చిరునవ్వుతో వసుబాలుడు ఆ వుత్తరం చూనుకున్నాడు. ఆచ్చంగా తన వ్రాతే.

"ఈ వుత్తరం ఎందుకు దాచుకోటం?!!"

,,ఆ వుత్తరమే అతి ముఖ్యమైంది, ఒక వేళ మీరు వాళ్ళరే పుట్లానికి దిలో వుంటే అప్పుడే వారికి ఈ వుత్తరం యివ్వాంని!!"

,,ఈ వుత్తరం ఈ ముద్రిక ఎలా దాచావు దేవీ! ఆ సరదారు ఒక స్త్రీ చేత తనిఖీ చేయించారు కదా!!"

"వేగులవారిలో శ్రీ చక్రవర్తి వేగుల వారికి వరిపోయిక వాళ్ళు భాగతఖండంలో లేరు! ఆ రెండున్నూ నా తలముడిలో దాచుకున్నా దేహమంతా నెకికిన మనిషి తలకట్టు విరిళ లేదు నుముడీ!"_

వసుబాలుడు ఈ నాలుగు దినాల్నుంచి కలలుకూడా ఎరగని కొత్త సంగతులు నేర్పుకోడమునే ఆశ్చర్యంలో పడివున్నాడు.

ఆ రెండు వస్తువులున్నూ వసుబాలుడు నడుముకు కట్టుకుని బట్ట సద్దుకున్నాడో, లేదో విరిగిపడ్డ ఒక కొండ ప్రవాహంలా గుఱ్ఱపుసైన్యం పారిపోతూ ఆ దారిని వచ్చింది. అనేక మంది గాయాలు తగిలి వగరుస్తూ ఉన్నారు. వారి గుఱ్ఱాలు రక్తాలు కారుతున్నవి. వారి కవచాలు ముక్కలైపోయి వున్నవి. విరిగిన కత్తులు ముక్కలైన కాళ్ళతో ప్రాణాలకోసం పరుగెత్తుకు పోతూ వచ్చారు. వాళ్ళు మనవారిని చూచారు. కొందరు రౌతులు ఓపిక లేక పోయినా గుర్రాలవాళ్ళ మీదకి తిప్పారు. వసుబాలుడు అరవిందాదేవిని వెనక్కు తోసి, కత్తిలాగి ఝుళిపించి, దీవురించిన మొగంతో హృదయంలో ఏ మూలలోనూ లేని భయంతో నిలుచున్నాడు. గుఱ్ఱాలు పకిలిస్తుండగా నలుగురు రౌతులు నాలుగు వైపులా వచ్చారు. అరవింద చూస్తున్నది. ఆ దినాన వసుబాలుడు దెబ్బ తగిలిన సింహంలా పోరాడు; దెబ్బలు తిన్నాడు; రక్తధారల ఎరుపుతో ఉదయబాలబింబం అయ్యాడు. కొనఊపిరి వున్నంత సేపు ఏటుఏటుకు తప్పుకోడం; పొడుపు గొడుపుకు వంగడం, అలా యుద్ధం చేసి వేటకుక్కలమందర కొమ్ముజింకలా, పెద్దపులుల మధ్య వృషభ రాజాలా, తన దగ్గిరకు వాళ్ళని రానీయకుండా యుద్ధం చేశాడు.

చేతిలో కత్తి యెగిరిపోయింది; నెత్తిమీద బలమైన గాయం తగిలింది కళ్ళలో మెరుములు కమ్మ గిఱ్ఱున తిరిగిపోతూ గబుక్కున చైతన్యం వదలి పడిపోయాడు.

అరవింద ఛంగున ముందుకు ఉరికింది; దాచి వుంచుకున్న బాకు తీసింది; నాలుగు దెబ్బలుతిన్నది. ఒకడి గుఱ్ఱాని పొడిచివేసింది; మహాశక్తి అయి పోయింది అరవిందాదేవి. నాలుగు క్షణాలు జరిగినవి.

ఇంతలో డెక్కలచప్పుడు, సింహనాదాలు వినబడ్డవి. రాయల గుఱ్ఱపు దళం కాలోలు విల్లునుంచి వచ్చే బాణంలా వచ్చింది. దానితో చెల్లాచెదరై పారిపోయారు. ఆ బీజపూరు రౌతులు అందులో ఒకడు కసిగొని

గుఱ్ఱంమీదనుంచే వంగి, తూలిపడపోతూ ఉన్న, అరవిందాదేవిని ఒక్క అదటున మీదికి లాక్కొని పారిపోయాడు.

ఆవచ్చిన రౌతులిది చూశారు; వాళ్ల వెనక అమిత వేగంగావచ్చిన సైన్యంయావత్తూ ఊడాయించారు. కాని నాయకుడు పక్కనున్న రౌతుకి "ఇప్పుడు జరిగిన ఆ అధర్మయుద్ధంలో ఒకవ్యక్తి పడిపోయి వున్నట్టు వున్నాడు: చచ్చినాడో బ్రతికివున్నాడో చూచిరా. కొనఊపిరి వుంటే నెమ్మదిగా నీదగ్గిరమందులు ఇచ్చి మన శిబిరానికి తీసుకుపో" అని అజ్ఞ యిచ్చాడు. అతడు వెనుతిరిగి మన వసుబాలుడు పడివున్న స్థలానికి వచ్చాడు. వాడి చూశాడు. 'ఊ' అని తల ఊపుతున్నాడు. మందులసంచి లోవున్న ఒకచిన్నమాత్రతీసి పళ్ళు బిగిసిపోయివున్న వసుబాలుడు నోరు బలంతో విడదీసి ఆమాత్ర వేశాడు. దానితో వసుబాలుడు ఒక్క నిమేషంలో మూలగడం ప్రారంభించాడు.

౯

వసుబాలుడికి మెలుకువ వచ్చేటప్పటికి ఒక గుడారంలోవున్నాడు. మంచి పరుపులు, దిండ్లు వులకనుంచంమీద పరిచివుండగా, అందుమీద పడుకొని వున్నాడు గబుక్కున లేవబోగా అక్కడేవున్న ఒకాయనవద్దని వెనక్కు పడుకోపెట్టాడు,

వసు.— నే నెక్కడున్నాను?

అతడు:— శ్రీ విద్యానగరాధీశ శ్రీ శ్రీ మూరురాయరగండ కృష్ణరాయ సార్వభౌముని శిబిరంలో వున్నావు.

వసుబాలుడు ఆశ్చర్యంతో మళ్ళీలేవ బోయాడు, నెమ్మదిగా చిరునవ్వు నవ్వుతూ ఆ వ్యక్తి వసుబాలుణ్ణి వెనక్కు పడుకో బెట్టాడు.

వసుబాలుడు— ఒక బాలిక వుండాలి!

“ఆమె క్షేమంగా వున్నది లెండి”

వసుబాలుడికి అమ్మయ్యా అని పించింది.

అతను:— ఈ దినానికి నువ్వు కదలకూడదు గాయాలు చాలా తగి లాయి అందుకని నా ప్రార్థన.

వసు:— అదంతా నాకు తెలియునండీ నేను ఇప్పుడు తత్క్షణం అప్పుడే వారి దగ్గరకు పోవాలి. నేను వారికి అతిముఖ్యమైనటువంటు వేగు యివ్వాలి.

అతను:— రేపు యివ్వకూడదూ?

వసు:— ఇప్పుడు జరిగే యుద్ధ ప్రాముఖ్యం మీకు తెలుసునా?

అతడు:— నేను వైద్యుణ్ణయ్యా!

వసు:— వైద్యులకి కూడా ఎందుకు యుద్ధంచేత కాకూడదూ? కవులు అందరూ ఆ యుద్ధం చేయవలసిందే కాదా!

అతడు:— నిజం, నేను వరశింహా దేవరాయ సార్వభౌముల దగ్గర సేనానాయకత్వం చేశాను—

వసు— అమ్మయ్యా! అటాయితేనరే మీకు నమస్కారము! నాకు ఇప్పుడు బలం వచ్చే మందు యివ్వండి నేను అప్పుడే వారి శిబిరానికిపోతాను

ఫిరంగుల మోతవినబడుతూనే వుంది ఆవ్యక్తి మారు మాట్లాడకుండా తన మందుల పెట్టెలోంచి ఒక బుడ్డితీశాడు,

“ఇందులో ఒక మందు వుంది. ఒక చుక్క అమృతం, రెండుచుక్క లకు గడియలదాకా మనిషి యుద్ధం చేయగలడు; ఏనుగును ఎత్తగలడు.”

వసుబాలుడు సరే అన్నాడు. ఆచుక్క త్రాగినాడు ఆతని దేహంలో ఒక శక్తి ప్రవాహం అతివేగంతో ప్రవేశించి కొండ పిండికొట్టగలనన్న బలం వచ్చినట్లయింది. లేచాడు. ఆవైద్యుడు పైనవున్న సేవకునికి ఆజ్ఞ యివ్వగానే అతను గుఱ్ఱాంఒకటితీసుకువచ్చి నిల్చున్నాడు. వసుబాలుడు అగుఱ్ఱంఎక్కాడు ఇంకోరౌతు సిద్ధంగా ఉన్నాడు. అతను ముందూ, వసుబాలుడు వెనకగా

మహా పట్నంలా వున్న శిబిరంలో ఆగుడారాల వీధుల్లోంచి వెళ్ళి వెళ్ళి, అనేక మంది రౌతులు, బలమైన పదాతులు కావలి వేస్తూ పట్టుజల్తారిముత్యాలతో అలంకరింపబడి కుబేరమందిరంలా వున్న గుడారం దగ్గరకు వెళ్ళినారు ఆపక్క శి ఆడంబర రహితంగా సౌభాగ్యము చూపిస్తూవున్న గుడారం గుమ్మందగ్గర ఆగారు.

దారిలో వసుబాలుణ్ణి అనేకమంది రౌతులు అపినారు; కాని ముందు పోయే అశ్వికుడు ఏదో జవాబుగా చెప్పగా పోనిస్తూ ఉండేవారు.

పై గుడారం దగ్గరకు వెళ్ళి గుర్రాలు దిగారు. అక్కడ ఉన్న ద్వారపాలకుడు లోపలికి పోయేందుకు గురుతు ఇవ్వమన్నాడు. వసుబాలుడు ఒక ముఖ్యకార్యముమీద శ్రీ సార్వభౌముని సేవకు వచ్చానని చెప్పుచున్నాడు ద్వారపాలకుడు పనికిరాదన్నాడు. వసుబాలుడికి కోపం వచ్చింది. "చాలా ముఖ్యవిషయం! అందుమీద అంతా ఆధారపడి ఉందయ్యా!" అన్నాడు. ద్వారపాలకుడు లాభంలేదని తల ఊపినాడు.

వసుబాలుడు గుఱ్ఱం ఎక్కి బయలుదేరినప్పటినుంచి తాను మహమ్మదీయులతో పోరిన విధం, తనకు స్పృహతప్పిన విషయం అంతా జ్ఞాపక వచ్చింది. తనకు శ్రీదేవి, అరవిందాదేవి ఏమయిపోయింది? సురక్షితంగా ఉందంటే! ఎక్కడ ఉన్నది? ఆ వైద్యుణ్ణి ఇంకా తప్పీళ్ళు అడగవలసిందే కాని ఆ దేవి ఆజ్ఞ శిరసావహించేగా, తాను ఈ వేళ శ్రీ అప్పాజీవారికి తెలియజేయడానికి వచ్చింది. ఆ, జ్ఞాపకం వచ్చింది. ఆ బేగిరావు ఉత్తరంతోపాటు ఆమె శ్రీ సార్వభౌముని రహస్యముద్రిక యిచ్చింది అది పనికిరాదా!

"ఓ ద్వారపాలకుడా! ఈ గురుతు చూసి నీ యిష్టంవచ్చినట్లుచేయి" అని వసుబాలుడు తన దేహాన భద్రపరచుకొన్న ఆ ముద్రిక చూపించాడు, ఆ ద్వారపాలకుడు వంగి నమస్కారముచేసి, తత్క్షణమే లోపలికి పోయి

వచ్చి, "శ్రీ అప్పాజీ ప్రభువు మీ రాకకోసం చూస్తూ ఉన్నారు" అని అన్నాడు.

వసుబాలుడు లోనికిపోయాడు. విజయనగరసామ్రాజ్యం దేదీప్యమానంగా మట్టమధ్యాహ్న సూర్యునిలా వెలిగేటట్టు చేసిన శ్రీ సాళువ తిమ్మరుసు మహామంత్రిలవారు పరుపులపై అధివసించి, ఏవో పత్రాలు తిరగవేస్తున్నారు.

వసుబాలుడు ఆ వృద్ధునకు వీరనమస్కారం చేసి నుంచున్నాడు. తిమ్మరుసు తలయెత్తకుండా "నువ్వు ఏ వేగువాడవయ్యా! నీ ముఖం మాకు పరిచయస్మృతి తెస్తున్నదే!" అని ప్రశ్నించారు.

"ప్రభూ, నేను వేగుసైన్యంలోలేను. ఈ ఉత్తరం తమకు అందచేయవలసిందిగా ఒక బాలిక — అరవిందాదేవి — ప్రతాపనాయునింవారి కొమార్తె ఇచ్చింది" అని వసుబాలుడా ఉత్తరం పట్టుకొన్నాడు.

అప్పాజీ వెంటనే తలయెత్తి, అతిఆనందంతో "ఎవరురా అక్కడ?" అని కేకవేయగానే ద్వారపాలకుడు పరుగిడివచ్చాడు. లేచి వసుబాలుని దగ్గరనుండి ఆ ఉత్తరం అందిపుచ్చుకొని, "శ్రీ తిమ్మనాయునింవారిని, శ్రీ వేగేశిన అనంతమల్లనగమహారాజులను సార్వభౌముల గుడారానికి రావలసిందిగా చెప్పు" అని ఆజ్ఞ ఇచ్చి, వాడు పోగానే, వసుబాలుణ్ణి చూచి, "అబ్బాయీ! నీ విషయం అంతా గమనిస్తే, నువ్వు ఎన్నో కష్టాలు కోర్చి, ఈ ప్రాణప్రదమైన లేఖ పట్టుకువచ్చినట్లు కనబడుతోంది! నువ్వు ఎవరవో నాకు స్పష్టమౌతున్నది శ్రీ చక్రవర్తికడ నీ చరిత్ర చెప్పుకొందువుగాని రా!" అని అనునయిస్తూ, చిరునవ్వు నవ్వుతుంటూ వసుబాలుని మోము పరికిస్తూ, రెండుసార్లు ఇటునటు తిరిగి, గుడారం ఈవలికి వచ్చారు.

వసుబాలుణ్ణి వెంటబెట్టుకొని, తన గుడారం దాటి సార్వభౌముని శిబిరంవైపు నడుస్తున్నారు. దారిలో సైనికులు, దళవాయిలు, చమూపతులు

అంతా వీర నమస్కారాలు చేస్తున్నారు. అని అనుకుంటూ, చిరునవ్వు నవ్వుతూ, ఆశీర్వదిస్తూ సార్వభౌముని బంగారపు జరిగ పని చేసిన పట్టు శిబిరాలను సమీపించారు.

అప్పాజీగారిని చూడగానే, సార్వభౌముని అంగరక్షకులు ఎదురై ,,మహాప్రభువులు సభా శిబిరంలో వేంచేసి ఉన్నారు'' అని మనవిచేశారు. అప్పాజీవారు సభామందిరానకు వసుబాలుని తీసుకుపోయారు, సార్వభౌముని చక్రిరక్షకులు, ద్వారపాలకులు, అంగరక్షకులు, చారులు అందరువంగి అప్పాజీకి వీరనమస్కారాలు చేశారు.

అప్పాజీ వారు రావడం చూడగానే పారిపార్శ్వకుడొకడు తల వాల్చి సభామందిర శిబిరంలోకి పోయి ,,జయ జయ జయ !!! మహారాజాధిరాజా !'' అని గుమ్మందగ్గిర మోకరించి, శ్రీ అప్పాజీవారు వస్తున్నారు !'' అని మనవిచేసుకొన్నాడు. సార్వభౌములు వెంటనే సింహపీఠికనుండి దిగి, గుమ్మందగ్గిరకు ఎదురువచ్చి, అప్పాజీవారికి నమస్కరించి, వారిచ్చిన ఆశీర్వచనా లందుకొని, అప్పాజీవారి చేయిపట్టుకొని వారి మంత్ర్యాసనం అధివసింపచేసి తాము వెళ్ళి తమ సింహాసనం అధివసించారు.

ఇంతిలో వసుబాలుడు లోనికిరా అప్పాజీ కోరిక తెలియజేశారు. వసుబాలుడు లోనికి ప్రవేశించి, వెంటనే సార్వభౌముల యెదుట మోకరించారు.

సార్వభౌములు అప్పాజీవంక చూచి ,,నాయనగారూ ! ఎవరీబాలుడు అని ప్రశ్నించారు.

,,మహాప్రభూ ! ఈతడు అతిముఖ్యమైన వేగుకొనివచ్చాడు తిమ్మన్ననాయకులవారికీ, అనంతమల్లవరప్రభువులూ వస్తున్నారు.

అప్పాజీ వసుబాలుణ్ణి ఒక ఆసనం అధివసించ తలవంకించి సంజ్ఞ చేసినారు.

ఇంతలో తమ్మన్ననాయకులూ, అనంతవరమల్లవరప్రభువులు వచ్చి ప్రభువుకు వీరనమస్కారాలు చేసి అనుమతి సంజ్ఞవలన ఆసనాలు అధివసించారు.

అప్పాజీ అరవింద ఉత్తరం తమ్మనాయకులకు ద్వారపాలకునిచే అందిచ్చినారు.

తమ్మన్న:—ఈ ఉత్తరం ఏమిటి మహామంత్రీ?

అప్పాజీ:—అరవింద ఉత్తరం.

తమ్మన్న:—„ఆ వచ్చిందీ, వచ్చింది! అమ్మయ్యా, ఇంక రావని నిస్పృహ చేసుకున్నాము మా వేగువారందరమూ! ఇంక రాయచూరు రెండు నిమిషాలలో! ఏదీ? ఎవరక్కడ? నీళ్ళతో బిందె - చిన్నది" అని అంటూ లేచి „మహాప్రభూ! ప్రతాపనాయకులవారి అమ్మాయి అరవింద రాయచూరు రహస్యాలు పంపిందని విన్నవించుకుంటున్నాను" అని సంతోషంతో మనవిచేశారు.

ఇంతలో నీళ్లబిందె వచ్చింది. వెంట తమ్మన్ననాయకులు ఒక బరిణె తన సంచికట్టులోనుండి తీసి అందులోనుండి పొడుమును కొంత ఆ బిందెలో వేసినారు. దౌవారికుడు ఆ నీళ్ళు కలపగానే ఆ ఉత్తరం అందులో వేసినారు. సిరియాలదేవిని పంపండి" అని పసుపాలుడు రాసినట్లున్న ఉత్తరపు అక్షరాలన్నీ మాయమైపోయినవి.

వెంటనే తమ్మన్ననాయకులా ఉత్తరం నీళ్ళలోనుంచి తీసి ఇంకొక బరిణెలో ఉన్న హారతికర్పూరము తీసి, చెకుముకి వెలిగించి మంచు దూది మండించి, ఆ మంటలో కర్పూరము వెలిగించి, ఆ కాగితాన్ని ఆ పొగలో ఉంచినారు.

మంత్రంలా ఆ పొగలో ఆ పెద్దకాగితంమీద గీతలు అక్షరాలు చీమల బారులలాంటివి క్రొత్తవి వచ్చి ప్రత్యక్షమైనవి.

ఆ ఉత్తరం మెత్తటిబట్టలో అద్ది, తిమ్మన్ననాయకులు సవినయంగా సార్వభౌములకడకు కొనిపోయి, సింహాసనం దగ్గర పీఠంపై ఉంచినారు.

అప్పాజీ, అనంతమల్లవరదప్రభువులు, తిమ్మన్ననాయకులు, సార్వభౌములు ఆ పత్రం చూస్తూ "ఇదిగో ఇక్కడ అగడ్త లోతు తక్కువ, ఇక్కడ గోడ అవుటు, ఇక్కడ రక్షకసైన్యం ఎక్కువ ఉంది, ఇక్కడ ఫిరంగులు బలమైనవి. ఇక్కడ ఫిరంగులు పాతవి. ఈవైపు మనవారు సిద్ధంగా ఉన్నారు." అని తిమ్మన్ననాయకులు మనవి చేస్తుంటే, తక్కినవారు వింటూంటే, సార్వభౌములు దీక్షగా గమనిస్తున్నారు,

సార్వభౌముడు చిరునవ్వు నవ్వుతూ వసుపాలుణ్ణి దగ్గరకు రమ్మన్నారు. వసుపాలుడు దగ్గరకు వెళ్ళి ఆ సింహాసనపాదాన నిలబడ్డాడు.

"నీ చరిత్ర చెప్పు."

వసుపాలుడు చక్రవర్తి ఆజ్ఞ కాగానే ఆ బలతారుగుడారం, ఆ మణిదీపంబుడ్ల మిణమిణలూ, పట్టుపరుపులు, కాశ్మీరరత్నకంబళ్ళు, పట్టుకలంకారీ తెరలు, ముత్యాల జాలర్లు—అన్నీ మరచిపోయినాడు. కవీ భావోన్మాదీ, ప్రేమపూర్ణజీవీ. ఆనందాత్ముడూ అయిపోయి మొదటినుంచి చరిత్ర పూసగుచ్చి ఏకరువు పెట్టినాడు.

అతని కథలో అందరూ తన్మయత్వం పొందినారు. సార్వభౌముని మోదమూ, అప్పాజీగారి సంతోషమూ, తిమ్మన్ననాయకులు పొందిన ఆనందమూ అపరిమితము; ఒక పారిపార్శ్వకునితో చెవులో రహస్యం చెప్పి పంపించాడు.

"ఏమిటీ, నువ్వు శివపాలరెడ్డినాయకుల కుమారుడవా?" అని సార్వభౌములు ఆశ్చర్యం వెలిబుచ్చినారు.

"పెద్దన్నగారి శిష్యుడవా!" అని తిమ్మరుసు తలపంకించాడు.

„పారశీకం నేర్పుకు నెందుకు బీజప్రరం కోల్తాసాలి?” అని మల్లవరప్రభువు చిత్రం అయిపోయాడు.

తమ్మన్ననాయకులు మాట్లాడలేదు. వసుపాలుని కథ పూర్తి అయింది. అతడు చక్రవర్తి యెదుట మోకరించి, „మహారాజాధిరాజా! నేను ఆ బాలికను.....ఆమె ఇప్పుడు ఎక్కడ ఉన్నది? ఆమెను అడగలేదుగదా? ఆమె చరిత్ర ఏమిటి? నాకు తెలియజేయ ప్రార్థించుచున్నాను” అన్నాడు.

సార్వభౌముడు చిరునవ్వుతో వసుపాలుణ్ణి దగ్గరకు రమ్మని, తన మెళ్లో ఉన్న దివ్యమణిహారం ఒకటి తీసి అతని మెళ్లో వేసి, తలనిమిరి—„కవివిన్నీ వీరుడవున్నూ అయి నీ చక్రవర్తికి సహాయం చేసుకో!” అని పెద్దనామాత్యులకు కబురు పంపవలసింది అని అన్నారు.

ఒక ద్వారపాలకుడు వేగంగా పోయినాడు. వసుపాలుడు భూలోకంలో లేడు. ఇదివరకు చక్రవర్తిని దూరంగా చూడడమే, ఆయనతో మాట్లాడలేదు. ఆయన తల నిమిరినప్పుడు శ్రీ ఆదివిష్ణువు ఆశీర్వదించినట్లయింది. జన్మసాఫల్యం అయింది అనుకున్నాడు వసుపాలుడు.

ఇంతలో ఒకపక్కనుంచి పెద్దనామాత్యులు, ఒకపక్కనుంచి శివశాలరెడ్డినాయకులు చక్కావచ్చి సార్వభౌమునికి నమస్కారములు చేసి ఆసనాలు అధివసించారు.

వసుపాలుడు ససంభ్రమంగా లేచి గురువుగారికి మోకరించి నమస్కరించాడు. ఆయన లేవదీసి, „ఏమి చిక్కావు, గట్టితనం దాల్చావు, ఈ గాయాలు, ఈ కట్లు ఏమిటివి!” అని అన్నారు.

వసుపాలుడు తండ్రికి మోకరించినాడు అతడు కుమారుని యెత్తి మూర్ధమాఘ్రాణించాడు కళ్ళనీళ్ళు తిరుగుతూ ఉండగా, గొంతుకలో డగ్గుత్తిక పడుతూ ఉండగా, కుమారుణ్ణి గట్టిగా కౌగిలించుకున్నాడు. అక్కడ ఉన్న అందరకు కళ్లలో నీళ్ళు తిరిగినవి.

అప్పాజీ—శివబాలరెడ్డినర్యా! నీ కుమారుడు తన సార్వభౌమునికి, విజయనగర సామ్రాజ్యానికి తీరరాని ఉపకారం చేసినాడు. శ్రీ సార్వభౌములు అతనికి నూకపాలెం జాగీరు దయచేయుచున్నారు" అని అప్పుడే చక్రవర్తి స్వహస్తనామాంకితమైన ముద్రవేయగానే ఆ పత్రము పుచ్చుకొని వసుబాలుడికి యిచ్చినాడు.

ఇంతలో పరిత్రాణనాయుడు ఒక బాలికను మేలిముసుగుతో కొని వచ్చినాడు. అందరూ పరిత్రాణనాయకుణ్ణి బహూకరించారు. వసుబాలుడి గుండెలు కొట్టుకున్నవి, అతనికి దివ్యగీతానాదములు వినిపించినవి. వేయూరు అపరిమిత సుగంధములు వీచినట్లయినవి.

అప్పాజీ:—పరిత్రాణనాయకా! నువ్వు నీ సార్వభౌములకు చేసే సేవ అపరిమితము. నీ కుమార్తె ఎవ్వరికిన్నీ సాధ్యముగాని రహస్యభేదనాలు నీ సహాయంతో చేసి అత్యుత్కృష్టమైన సేవ చేసింది. ఆమెకు శ్రీ సార్వభౌములు నూరసపాలెం జాగీరు పక్క వున్న వీరనపాలెం జాగీరు దయచేస్తూ ఉన్నారు. ఆ రెండు జాగీర్లు కృష్ణాతుంగభద్రల్లా ఉంటాయి గాక!

సార్వభౌములు, మల్లవరప్రభువు, తిమ్మనాయకులు "తథాస్తు" అని అన్నారు.

అప్పాజీ సార్వభౌమునివంక చూచి అన్నాడు. "దేవా! ఈ తిమ్మన నాయకులే ఈ నాటకానికి సూత్రధారులు. ఈలా వస్తుందని అనుకోలేదు. ఈ అమ్మాయి అందం లోకప్రసిద్ధం. అమ్మాయిని వసుబాలుడికి యివ్వడానికి తన కుడిచెయ్యి అయిన పరిత్రాణనాయకునితో ఆ బాల ఎక్కడో కష్టంలో, దొంగలు కొట్టుకున్నట్లుగా ఏర్పాటుచేసి అతడు ఆమెను రక్షించేట్లు చేయాలిసిందిగా ఆజ్ఞాపించారు. శివబాలుని కుమారునకు పరిత్రాణపుత్రికుమార్తెను యిచ్చునట్లు శ్రీదేవర ఆజ్ఞ ఇదివరకే పుచ్చుకున్నాను కదా! అది నేను పంపినాను. కాని ఇంతకూ జరిగినకథ వేరు. విరూపాక్షుడే వసుబాలుడికథ తాను నడిపాడు!

# ౧౦

రెండురోజులైన వెనుక వసుపాలుడు చరిత్రనాయనింవారి శిబిరానికి పోయినాడు. అవరోధజన శిబిరాలు చరిత్ర నాయకుని శిబిరానికి వెనకగా ఉంటాయి. అంతఃపురస్త్రీలు కనబడరు.

వసుపాలుడు చరిత్రనాయనింవారి శిబిరానికి వెళ్ళగానే ద్వారపాలకు లాతనికి నమస్కరించి, ఒక డేరాలోనికి తీసికొనివెళ్ళి అచ్చట ఆతనిని అధివసింపచేసినారు.

వసుపాలుడు అచ్చట ఉచితాసనంపై కూర్చుండి హృదయం మారుమ్రోగుతుండగా ఒంటరిగా అన్నీ చూస్తూ ఉన్నాడు. ఆ డేరాలో అలంకారాలు. ఉన్న వస్తువులు ఒక బాలిక అలంకరించుకొనే మందిరంలో ఉన్నవానిలా ఉన్నాయి.

వివిధ సుగంధాలా డేరాలో ప్రసరిస్తున్నాయి. ఒకచో కొన్ని పట్టుచీరలున్నాయి. ఒకచోట జరీబుటావు పనిచేసిన పట్టు రవికలారవేయబడి ఉన్నాయి. చందుగాపెట్టెలు, గుంకిని తోలుపెట్టెలు, నగలపెట్టెలు ఉన్నవి. ఒకచోట పాలరాతి గంధపేటికలున్నాయి.

ఇంతలో ఒకద్వారానికి ఉన్న తెర ఒత్తిగింపబడి, ఒక బాలిక లోనికి వచ్చి, కలకలలాడుతూ ఉదయప్రాంగణాన ప్రత్యక్షమూర్తి ఉషాదేవిలా. దివ్యాకాసారమధ్య వికసిత సహస్రదళకమలస్థ లక్ష్మీదేవిలా, చిరునవ్వులో పోతపోసిన సౌందర్యరాశిలా, అరవిందబాల నిలుచుంది.

ఒకేఒక్క క్షణికమట్లా బాలిక నిలుచుండి "మీరేనా ప్రభూ!" అంటూ మెరుపులా, సుగంధకల్లోలంలా, వేయి ఆనందాల సుడిగుండంలా వచ్చి వసుపాలుని ఒళ్లో వాలింది! వసుపాలుడు మైమరచాడు!

మొదటిసారి ప్రత్యక్షమైనస్వప్నమూ యీలాగే వచ్చింది. ఇంతలో ఆమె అతని కౌగలించి గాఢంగా అతని పెదవులు ముద్దుగొన్నది.

ఒకరి గాయాలు ఒకరికి చూపించుకుంటూ, ఒకే ఆశ్లేషంలో విడిపోక ఒకరై, వారు మాటలు లేక అలా ఉండిపోయారు.

"అమ్మగారు మిమ్మల్ని నా మందిరపు దేవాలో చూడవచ్చునన్నారు. మీకు వార్త పంపాను సుమండీ. ఇక మీరు నన్ను కోల్పోలేనట్లనగా చూడలేరులెండి. ఆ దినాలు ఎల్లాగడుపుకుంటారో ఓ తాయిలంగారూ! నేను మాత్రం ఒక నిముషం ఒక కల్పంగా——"

"ఆ ఇబ్బందులు అక్కర్లేదులెండి ఓ నారిణీ దేవిగారూ! అప్పాజీ వారు పెట్టించిన ముహూర్తం వారం రోజులలో. ఇక్కడేబలెండి ఒక మహోత్సవమని పరితాపవాయునింవారు వార్త పంపారు ఎల్లుండి ప్రధానానికి వస్తున్నామని. ఇక ఓ తాయిలంగారు ఏమంటారు?"

"ఏమంటావా?" అంటూ గబుక్కున లేచి ఆమె గుమ్మందగ్గరకు పరుగిడింది. వసుబాలుడూ ఉరికి, ఆమెను గట్టిగా హృదయానికి అదుముకున్నాడు.

వారిద్దరూ ఆ తన్మయంలో ఒకరి మోము వొకరు చూస్తూ, తమ తరువాయి కథారహస్యం చెప్పుకుంటూ ఉండిపోయారు.

# కథా సూచిక



106

| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 102 B 117 |
| పుస్తకం పేరు | Gozels |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CL, BCL |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | no |
| తప్పులు | no |
| పరిస్థితి | good |